# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

## GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY



'GRIHALAKSHMI' GRIHA


సంపాదకుడు

డాక్టరు కె. యన్. కేసరి





సంపుటము ౨౧] మార్చి 1952 [సంచిక 3




సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

ప్రకటనలు

ముఖ్యముగా-స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొరకు వ్రాయునది.

వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగనున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

త్వరలో
విడుదల!







ఎ.యస్. ప్రొడక్షన్సు వారి,

# ఆడబ్రతుకు

శ్రీరంజని...... కనకం...... కృష్ణకుమారి...... బేబి మల్లిక..

ప్రొడ్యూసర్... A. నరసయ్య.... డైరెక్టర్.... B.A. సుబ్బారావు...

చమ్రియా రిలీజ్.

# విషయసూచిక





ఉత్సవమునకు వచ్చిన పురప్రముఖులు

కంకణ గృహీత శ్రీమతి రుక్మిణమ్మగారు, ఆమె భర్త, అధ్యక్షురాలు శ్రీమతి పద్మాసనమ్మగారు మధ్య పుష్పమాలాలంకృతులై కూర్చొనియున్నారు. వారి కుడిప్రక్కన శ్రీ కె. యన్. కేసరిగారు కూర్చొనియున్నారు.




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారి ప్రశంస

## గృహలక్ష్మి జయంతి సందర్భమున డాక్టరు కె. యస్. కేసరిగారి ఉపన్యాసము



సోదర, సోదరీమణులారా!

ఈతూరి యీస్వర్ణకంకణమును నేటిశుభదినమున శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ గారికి అర్పించు మహాభాగ్యము నాకు కల్గినందులకు నేనెంతయు సంతసించుచున్నాను.

నేనిదివరకు స్వర్ణకంకణముల నర్పించిన సాధ్వీమతల్లుల భాషావిశేషత, లలిత కళలయందునేర్పు, భాషాభిమానము, వ్యవహారకుశలతలగూర్చి తమకు తెలియకపోలేదు. అయినను, అట్టివారల నామధేయములు తమకు యిప్పుడు మరల స్ఫురణకు దెచ్చుట ఉచితము.

1. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ 2. చిల్కపాటి సీతాంబ 3. కాంచనపల్లి కనకమ్మ 4. పులవర్తి కమలావతీదేవి 5. రత్నాల కమలాబాయి 6. బాలాంత్రపు శేషమ్మ 7. చేబ్రోలు సరస్వతీదేవి 8. వి. రాధామణి 9. బత్తుల కామాక్షమ్మ 10. (కీ. శే.) ఉన్నవ లక్ష్మీబాయమ్మ 11. బెంగుళూరు నాగరత్నమ్మ 12. గంటి కృష్ణవేణమ్మ 13. గిడుగు లక్ష్మీకాంతమ్మగారలు.

ఈపై పేర్కొన్న విదుషీమణులందరు ఒక్కొక్క విషయమున ప్రావీణ్యమైన వారలే యని మీ రెరుగనిది కాదు. స్వర్ణకంకణహారములో మణిపూసకు తుల్యమగు శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు శ్రీదేవీభాగవతమును రచించిరి. ఈసాధ్వీమణి రుక్మిణి; నాసగోత్రురాలు. మాశాఖకు చెందినవారు. ఆమెభర్తయే, ఆమెగురునాథుడు. ఈమె చక్కని విద్యావతి; కవయిత్రి. ఈమెపడసిన పసిండిసన్మానములలో నిదియొకటి. ఈమె రచించిన దేవీభాగవతమునందలి కథారచనలు పురాణయితిహాసములాధారములు, ఉదాహరణములు-మృదుమధురశైలి, పదనిరూపణ, పదసంపదయుచూడ, శ్రీదేవియే, అనుగ్రహించి ప్రత్యక్షస్వరూపధారిణియై చెప్పి వ్రాయించెనో యన్నట్లున్నది. వీరిశైలి అట్టె చదువుకొన్నవారికి, సామాన్యులకు, స్త్రీజనాళికి, పండితపామరులకు, పాకపక్వమైన చక్కెరకేళి మాధుర్యమున భక్షణకు ఎంతయోగ్యమై, సులభమైయుండునో, చదువుటకు, మనసారగ్రహించి ఆనందించుటకు, పురాణరూపమున కాలక్షేపము లొనర్చుటకు కూడ, ఉత్తమమై పారయోగ్యమై యున్నది. ఈదేవిగారి దివ్యపాండిత్య మహిమవల్ల మా వంశముకూడ శోభగాంచెనని చెప్పనగును.

ప్రస్తుతము వీరు రచించిన దేవీభాగవతము శైలినిబట్టిచూడ మృదుమధురమైన కదళీఫల శైలియని చెప్పనగును. మధుర మీనాక్షి దేవీ ప్రాంతములందు యెత్తైన కొండల పైనఫలించు కొండఅరిటి (మలవాళ ఫలములు) అను అరటిపండ్లు తేనెలోమాగిన తియ్యని అరటిపండ్లకంటె మాధుర్యమైనవి. దేవిమీనాక్షి నేత్రవిశాల వీక్షణములవల్ల, సర్వులు సతతము లక్ష్మీ సరస్వతులతో తులతూగు కనకవస్తు వాహనములతో విరాజిల్లుచుందురు. అలాగే, యీసతీమతల్లి ఆంధ్రీకరించి మనకు అందజేసిన దేవీభాగవతమును చదివిన మేలగునని తలంచెదను.

ఇక మాదేవి రుక్మిణమ్మగారి జన్మస్థలము పడమటి గోదావరిజిల్లా, కృష్ణాగోదావరి నిత్యజీవనదులు ప్రవహించు పుణ్యభూమియని మనమెరుంగుదుము. లక్ష్మీ సరస్వతులంబోలిన నదీప్రవాహములకంటె శరవేగమున నురుకులెత్తుశైలి, మాధుర్యమై, అర్థగాంభీర్యమైనదనుటకు సందేహమేమియు లేదు.

కృష్ణా గోదావరి జిల్లాలు యిట్టి పుణ్యనదుల ప్రవాహిక కలిగినవి గనుకనే, చక్కెర కేళి అరటిపండ్లకు గణ్యతకెక్కిన స్థలము. దేవీ ప్రసాదసారములు కలిగిన కవిత్వము, ఫలములు, పంటకు మాధుర్యము నిచ్చునని నాసంతోషాభిప్రాయమును వెలిబుచ్చుచున్నాను.

ఇక నేడు గృహలక్ష్మి జయంతి ఉత్సవ సందర్భమున ఉత్సాహముతో అధ్యక్షత పదవి నలంకరించిన శ్రీమతి వావిలకొలను పద్మాసనమ్మగారు - పట్టభద్రురాలు, విద్యావతి; మహిళా ఉద్యమమునకు పట్టుకొమ్మ; నిరాడంబర సేవకురాలు; ఆదర్శగృహిణి, శాస్త్రాభిలాషి. ఆమెకును, సభవారందరికిని నాకందనములు. ఈ దేవీభాగవతము నచ్చొత్తించ ప్రోత్సాహమొనర్చి, సమయమునకు సహాయపడిన వారందరిని కొనియాడనగును.

ఈ దేవీ పురాణ దంపతుల సత్కరించి సన్మానించినందున నా అనారోగ్యము చక్కబడుననియే నా ఆశయము.

———(o)———

# స్వర్ణకంకణప్రదానోత్సవ ప్రశంస

 విద్వాన్ వేదము వేంకట కృష్ణశర్మ

శ్రీ పరదేవతాకృతి విశిష్ట వరిష్ఠ కళావిలాస నై
జావిత రూపితోరు కవితానిశ సద్యశ, తెల్గువెల్గు, స్థా
నాపతి రుక్మిణీ విదుషి, నర్మిలి సత్కృతిసేయు కేసరిన్
శ్రీపతి వాక్పతుల్ కరుణ చిప్పిల, నెప్పుడుఁ గాతురెంతయున్ ॥

అగణితవృత్తి, నాంధ్ర మహిళాభ్యుదయోన్నతి, సర్వతోముఖం
బగు విధమెంచి, సంచిత మహార్థము సార్థకమంద, స్త్రీలకున్
సుగము, ననామయం, బతివిశుద్ధ గుణావళి, విద్దెమీఁరి కో
ర్కెగదురఁజేయు కోటనర కేసరి, పూసరి తెల్గుతోఁటలోన్ ॥

సరిసరి! మన కే. యన్. కేసరి సరిపరికించి, యొక్క చవటపలుగు దా
సరి, సరిపెట్టుట కెదవేసరి, సరిదొరకమిని బొగడజంకుదు నతనిన్ ॥

చదువులందు ద్యుతికిఁ బారశాలచాలు, లలనలకుఁ దెల్వినిడ 'గృహలక్ష్మి'చాలు,
గాఢరుజలార్ప 'లోధ్రా' దికములుచాలు, గరితలకుఁ గేసరట్టి సోదరుఁడెచాలు ॥

(గృహీతకాశీస్సు)

కళుకు కవితాకుమారి నీకంటితళుకు గిలుపులన్, నాల్కనటియింప నుఱుకలెత్తు
నోము లెవినోఁచితో? నేఁడు, హేమకంకణము ధరించితి, - చేపు పెండరముగొనవె? ॥

### గృహలక్ష్మీ స్వర్ణకంకణ గృహీత

# శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారి

## ఉపన్యాసము

---

మహాశయులారా!

ఈరోజున మీరు నాయెడల చూపిన గౌరవాదరాభిమానములకు కృతజ్ఞురాలను.

'అసూర్యం పశ్యా రాజదారాః' అన్నట్లు రాజుల ఇల్లాండ్రు ఎండకన్నెరుగరు. అలాగే విప్రుల ఇల్లాండ్రు కూడా హోమవేదికలుదాటి ఎరుగరు. అంతమాత్రాన వారిలో జ్ఞానజ్యోతి ప్రకాశించి బయల్వెడలి ఇతరులకు దారి చూపింపకపోలేదు. అఖండమూ, అవ్యక్తమూ అయివున్న ప్రకృతి రెండు విధములై - స్త్రీ పురుషరూపమున విభజింపబడినప్పుడే, అనాది అయిన అవిద్య పరమాత్మ ప్రతిబింబరూపమైన జీవుని ఆక్రమించిన నాడే స్త్రీ పురుషుల ఆత్మస్వరూపమున వైజ్ఞానికాంశ సమముగానే వెలసినది. సంసారశకటమునకు స్త్రీ పురుషులు రెండు చక్రములు. ఆ రెండును తుల్యములే. బింబ ప్రతిబింబములు తుల్యరూపములే. కాని - నిపుణముగా పరిశోధించి చూచినచో ఒకదాని కొకటి విపర్యస్తమై యుండును. ఇట్టిదే స్త్రీ పురుషుల భేదాభేదము.

కాలక్రమమున నాగరికతలచే దైనిక కార్యక్రమమువలన స్త్రీ పురుష మానసిక శారీరకపు వృత్తులయందు మరికొంత భేదమేర్పడినది. వైషమ్యముగాని, వైమత్యముగాని ప్రకృతి సిద్ధమును, స్వాభావికమును గాదు. నేటి పాశ్చాత్యదేశములలోను, మన భారతదేశములో కొన్ని యెడలను ప్రశంసింపబడుచున్న ఫెమినిష్టు మూమెంటు అనగా స్త్రీలకు పురుష సాహాయ్య మవసరములేకయే ప్రాధాన్యమును, ప్రతిష్ఠయు సంపాదించు ప్రయత్నము కొన్ని కృత్రిమములయిన పరిసర ప్రభావములచేతను, కొందరి వ్యక్తుల గుణవిశేషములచేతను ఏర్పడుచున్నవి. కాని సర్వజీవి సామరస్య సూత్రము మాత్రము స్త్రీ పురుషుల సహకారోద్యమముపైని ఆధారపడి యున్నది.

ఆంధ్రవాఙ్మయమునకు ఆదిమజ్యోతి అయిన నన్నయభట్టు.

"శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషుయే
లోకానాం స్థితి మావహన్త్య విహతాం స్త్రీపుంస యోగోద్భవాం,
తే వేదత్రయ మూర్తయ స్త్రీ పురుషాస్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్త మాంబుజభవ శ్రీకంధరాశ్శ్రేయసే"

అనుశ్లోకమున త్రిపురుషాత్మకమైన ఈవ్యక్తసృష్టియందు వారు వక్షోముఖాంగములయందు శ్రీవాణీ గిరిజలను ధరించినట్లు అనాదియై సంప్రదాయ సిద్ధమైన, భారతీయ వైజ్ఞానిక దృష్టిని వర్ణించియున్నాడు.

"యత్రనార్యస్తు పూజ్యంతే - రమంతే తత్రదేవతాః . . ."

అని అభియుక్తి. ఇట్లు పవిత్రస్వభావములతో నిర్మింపబడినది భారతీయ గార్హస్థ్యము.

# శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారి ఉపన్యాసము

గృహలక్ష్మి

వరుసతో ధర్మార్థకామమోక్షములకు సమభాగిని భార్య - "నగృహం గృహ మిత్యాహుః ! గృహిణీ గృహముచ్యతే -" అనువాక్యము ననుసరించి గృహిణియే గృహపతి - గృహమందామెయే 'సమ్రాజ్ఞి' 'మాతృదేవోభవ -' అను భారతీయాచార్య సందేశము మన ధర్మమునకు స్వాభావికము. యక్షప్రశ్నములలో - ప్రత్యుత్తరముగా ధర్మరాజు -

"తల్లివేఁగుసువ్వొ ధరణికంటెను నాక। సంబుకంటెఁ బొడవు జనకుఁడరయ
గాడ్పుకంటె మనసు గడు శీఘ్రగతి తృణో। త్కరముకంటెఁ జింతగరము తలఁచు"

అనెను. ఇట్టిసంప్రదాయము కలిగిన భారత స్త్రీలు ఇంటిదీపములు.

వారిలో కొందరు కార్యరంగమున, రాజకీయాంగణమున, సమరభూమిని, సాదివ్యస్థానమున ప్రసిద్ధినొందిరి. ఇట్లుపొందుట తమకు స్వాభావికమై పురుషునితో సమముగా పంచుకున్న ప్రకృతి శక్తులు సమయమువచ్చిన ఉద్దీప్తములయి వికసింపగలవని నిరూపింప నవునేగాని ఆత్మస్వరూప విజృంభణ మాత్ర ఫలకములుగావు. శక్తిస్వరూపిణి అయిన దేవి వీరవిహారముసల్ప విజృంభించినపట్ల హరిహర బ్రహ్మాదులు అల్లాడిరి.

నేటి విద్యుత్ప్రవాహ యంత్రములయందు శక్తి - స్వాభావిక సారణులయందు ప్రవహించునంత కాలము ప్రపంచవృత్తి సాగుచునే యుండును. ఎక్కడనైన నొక్కచోట కట్టతెగినచో జ్వాలమాలాకు లితమై ప్రళయమేర్పడుటగాని చలనము స్తంభించుటగాని జరుగును. ఇదిశక్తి; ఇదియే స్త్రీస్వరూపము.

ఇక కావ్యజగత్తున స్త్రీకిగల స్థానమేమి ? కావ్యము కాంతా సమ్మితమని కోవిదులందురు. — 'కాంతా సమ్మిత తయా ఉపదేశయుజే' — అని మమ్మటుడు. ఈ కాంతా సమ్మి తత్వము ఎవరి నుండి బయలుదేరినది ? కాంతల నుండియా ? కాంతులనుండియా ? కాంతల స్వాభావిక కాంతుల నుండియే అని నా సమాధానము. అప్రయత్నలబ్ధమైన పరేంగితావగాహనము, అశిక్షిత పటుత్వము, స్త్రీ సహజశక్తియని పురుష పుంగవులు చాటుచున్నారు. కావున - కావ్యమార్గమును కాంతలనుండి కాంతు లెరింగి కవిచంద్రులయి విలసిల్లిరి. చంద్రున కిదియేశోభ. కాని - తమకు స్వాభావికమైన శక్తిని తమ కాంతులకర్పించి ఉపసర్జనీ భూతలయి లోకపోషణ చేయునట్టి త్యాగపరాయణలూ, ఉపకారపారీణలూ అయి స్త్రీలు ప్రకాశించుచున్నారు. కావ్యరచనమున ఆంధ్ర వాఙ్మయములో స్త్రీలు చేసినకృషి అల్పము. కాని - అధమముకాదు రామాయణము, వేంకటాచల మాహాత్మ్యము మున్నగు గ్రంథములు స్త్రీ సామర్థ్యమునకు తార్కాణములు.

పెద్దలయిన మీరు ఇప్పుడు నన్ను, నాయోగ్యతను గోరంత కొండంతలుచేసి స్వర్ణకంకణ ప్రదానమున సమ్మానించియున్నారు. సభాముఖమున ప్రసంగింపవలసినదిగా ఆదేశించినారు. ఏమిచెప్పవలెను ? ఇల్లాలినై - మదీయభర్తృ పాదసేవా పరతంత్రనై - శిశుపోషణ చేసుకొనుచు నిరంతర గార్హస్థ్య క్రియా సంపాద జంబాల పటలమున మునింగి ఏదో ఉబుసుపోకకు కొన్ని గ్రంథములను చదువుకొంటిని. పండితుడు, ప్రేమమూర్తి అయిన నా జీవితస్వామి దయవలన నాల్గుమాటలాడ నేర్చితిని. పెద్దలయిన పండితుల సన్నిధిని వారి వాగమృత ప్రవాహమున నాల్గుపుడిసెళ్లు జ్ఞానామృతముద్రావి పెద్దల మనస్సులు రంజింపచేయు చిలుక పలుకులు పలుక నేర్చితిని. అవి - పెద్దల మనస్సుల కుల్లాసము కలిగించుగాక !

నాకును - ఈ కంకణ ప్రదానమునకును - సభ్యులయిన తమకును - సామాన్యమయిన అనుబంధము కావ్యరూపమే - గావున దానిని గురించి రెండు మాటలు చెప్పదలచుకున్నాను.

అనాదిగా మనకున్నవి వేదములు. వానికన్న గురుతరములయిన కావ్యములు లేవని ఎల్లరంగీకరించినదియే.

'కవిం కవీనాం' అని బ్రహ్మనుగూర్చి వ్యవహారము. అనగా కవులలో ఉత్తమకవి. తన్ముఖ నిర్గతమైనవాక్కు కావ్యముగాక వేరొండెట్లగును? అట్టి వేదమునకు ప్రభు సమ్మిత మనుపేరు కేవల ప్రాయోవాదము. కాంతా సమ్మితములయి మంజు స్వరూపములయిన అర్థవాదాత్మక రచనలు వేదముల నిండియున్నవి. తరువాత నా వేదమే రామాయణ రూపమున లోకమున ప్రవహించినది. "వేదః ప్రాచేతసాదాసీ, త్సాక్షా ద్రామాయణాత్మనా" అని చెప్పబడుచున్నది. రామాయణముకంటె గొప్ప కావ్యమేది? ఈ ఆది కావ్యము తరువాత "భారతః పంచమోవేదః" అను మహాకావ్యము పుట్టినది. పైవాని ఛాయలుగానే ఏకదేశములై రఘువంశాదులు బయలుదేరినవి. వాని అనంతరమున పాకవిశేష సంపన్నములయిన నైషధాదులు విద్వదౌషధములై వెలసినవి. ఇట్లు వెలసిన సంస్కృత కావ్య ప్రవాహమే ప్రాకృత భాషలలో రూపాంతరితమై వెలసినది. పైచరిత్రవలన తేటపడు అంశ మొక్కటియే. కావ్యస్వరూపము, కావ్యమార్గము, కావ్యపరమార్థము అనునవి మూడును ఆదినుండియు నొక్క రూపముననే యున్నవి. దేశకాల భాషా భేదములు వీని స్వత్వమును మార్చలేవు. స్త్రీ రూపము - స్త్రీ ప్రకృతి - లోకమున స్త్రీ వలనకలుగు ఉపకృతియు - దేశకాల వ్యక్తి భేదములవలన ఎట్లు మారక అచంచలమైయున్నవో - అట్లే కావ్యమును ఉన్నదని నిశ్చితమగుచున్నది.

ఇట్టి కావ్యోదంతమున సంపాదించునదేమి? ఒకటే - లోక కల్యాణము, వ్యక్త్యానందము, విజ్ఞానసిద్ధి. అట్లే స్త్రీ ప్రకృతివలనను సిద్ధించునది - పైత్రితయమే.

మాతృస్వరూపమున బిడ్డలకు విజ్ఞానసిద్ధి కలుగచేయునది స్త్రీ. ప్రణయినీ రూపమున ప్రియునకు హితబోధ చేయునది స్త్రీ. కావున విజ్ఞానసిద్ధి స్త్రీ రూపమున కలుగుచున్నదన్న విషయం నిర్వివాదమైనది. మొదటి రెంటినిగూర్చి వివరింప నక్కరలేదు.

ఇట్టి కావ్యములు రచించుటయన్న సులభముకాదు. ప్రతిభ సహజముగా నుండవలెను. వ్యుత్పత్తి సంపాదింపవలెను. అభ్యాస మలవడవలెను. అటులనే ప్రతిభలేని వానిని, పాండిత్యహీనుని ఎవ్వరును ఒల్లరు. అవ్యుత్పన్నుని ఆతివలు ఆదరింపరు; అనభ్యస్తుని సరకుగొనరు. సనాతనుడైన ఈశ్వరుడు తపస్సుచేతనే శక్తిని సాధించెనని పురాణ ప్రసిద్ధము.

ఇంతవరకు చెప్పనేర్చినవి చెప్పితిని. చిన్నచిన్న పద్యకావ్యములు అల్లితిని. సభలలో పండితు లాదరించిరి. జీవితమున ముక్తి ప్రదమనిఎంచి దేవీభాగవత మనువదించి స్త్రీ లోకమున కర్పించితిని. స్త్రీకి గార్హస్థ్యమున శిశుసంరక్షణ, సకల సంతోష ప్రదాయకమని తెలుసుకొంటిని. ఆంధ్ర స్త్రీ లోకమునకిదియే పరమార్థ మని అనుభవ పూర్వకముగ మనవిచేయుచున్నాను.

# శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి

# స్వర్ణకంకణ మహోత్సవ ప్రశంస

[స్వర్ణకంకణ మహోత్సవ సందర్భమున పంపిన సందేశము]



ఈరీతి వార్షికోత్సవ వ్యవస్థను భారతదేశములో మరెందును కానము. భక్తునిపైగాని భక్తురాలిపైగాని పడుపూవు భగవంతునిపై, భగవతిపైపడును. ఏటేట శ్రీలోకముపై నీయుత్సవములందు రాలు పూలు సరస్వతీదేవిపై రాలుచున్నవి. ఈ దేవీపూజలో సువర్ణకంకణదక్షిణనొసగుటకై కంకణమును కట్టుకొనిన ఆనందవ్రతునకు ప్రసన్నదృష్టిగలదేవి సంపూర్ణారారోగ్యములను ప్రసాదించునని ఆశపడుచున్నాను.

ఆంధ్రవసుంధరలో నుదయించిన మహనీయులలో డాక్టరు కేసరిగారొకరు. వీరిని కనిపెంచినవి భాగ్యభోగములు కావు. మహాపురుషులలో ననేకులకు కన్నతల్లియైనది, స్తన్యమునిచ్చినది, ఉగ్గుబాలు పోసినది, గోరుముద్దలందించినది పేదరికమే. భవపరంపరసముద్భవ సంచితశక్తులు హృదయమున సన్నిహితమైయున్నపుడు వానిని విజృంభింపజేయుశక్తి నిష్పచ్చరమునకున్నది గాని ధనరాశికి కాదు. సహజ సౌభాగ్యమునంది, వజ్రసంకల్పమును సహపాఠిజేసుకొని, ఇచ్ఛాశక్తి నూతకోలగావించుకొని ధృఢనిశ్చయమును సైదోడనరించుకొని, సాధనమార్గమున ముందంజవేసి శ్రీ కేసరిగారు తమ జీవితసౌధమును నిర్మించుకొనిరి. ఇది మహోన్నతమైన దనుట ఎల్లరకు విశదమే. కాని కేసరిగారిది కుటీరమనియే భావించిరి. స్థూలదృష్టికి ప్రాకృతదృష్టికి మహోన్నతములైనట్లు గోచరించువస్తువులు సూక్ష్మదృష్టికి క్రమానుభూతివలన చేకూరిన ఆధ్యాత్మికదృష్టికి సామాన్య పదార్ధములట్లే గోచరించును. శ్రీ కేసరిగారు నిరాడంబరజీవి. భారతీయ సాంప్రదాయమందలి భావామృతము నాపోశనమొనరించు ఆనందవ్రతులువారు. నదీతీరములందును, కుటీరములందును, కుధరసీమలందును, కుంజవాటికలందును భారతీయసంస్కృతి పురుడుపోసుకొన్నది. "వన సందేశ"మను మహాగ్రంధమున కవీంద్రుడైన రవీంద్రుడీభావమును వ్యక్తీకరించెను. నేటి ప్రపంచతత్త్వవేత్తలలో తలమానికమైన శ్రీరాధాకృష్ణ పండితుడు గాంగనిర్ఝరసద్భాగారలందీ భావమును వ్యక్తీకరించుచు నేటి భువనమునకు భవతారకమంత్రోపదేశము జేయుచుండెను. యంత్రనాగరికతయందు జనించిన దశకంఠుని నేలగూల్చు రఘువరుడు మంత్ర నాగరకతయందవతరించునని ఎఱిగియే ఈ యాచార్యవర్యుడు జగతికి నేడీ మంత్రోపదేశమును చేయుచుండెను. మన సంస్కృతిలోని పరంజ్యోతికి జేజేలుపాడు ఉపాసకులు శ్రీ కేసరిగారు. వీరిదృష్టి నదీతీరమున నున్నది, కుటీరముననున్నది, ఆశ్రమజీవితముపై మిక్కిలి మక్కువజూపు ఈ మహనీయుడు ధన్యజీవియనుట నిస్సంశయము. మునిముఖ్యు లభిలషించు శాంతివీరికి చేకూరును, శాంతియందే కలదుకదా ఆనందము.

స్వయంకృషివలన, ఈశ్వర కటాక్షమువలన తమకు లభించిన ధనమును శ్రీ కేసరిగారు ధార్మిక ప్రయోజనములకొరకే వినియోగించుచున్నారు. వీరి గుప్తదానములు బహుళములు. వీరు స్థాపించిన విద్యాలయములును, అసంఖ్యాకములైన సత్కార్యములును వీరి హృదయగ్రహణ మెట్టిదో, వీరి దృక్పథ మెట్టిదో జగతి కెరిగించుచున్నవి.

స్త్రీజన పునరుద్ధరణము డాక్టరు కేసరిగారి పరమాశయములలో ముఖ్యమైనది. స్త్రీల కారోగ్యభాగ్యమును ప్రసాదించు దివ్యౌషధమును వారి కందించుచు వారికి మహోపకారమును చేయుచున్నారు. విశాల దృష్టిగల మహావ్యక్తి కావున, ఉదారాశయముగల మహాపురుషుడు కావున, మూర్తీభవించిన నమ్రతయనదగు మహనీయుడు కావున తానే తల్లుల వర్గమునకు ఋణపడియున్నట్లెంచుచు వారికి బహువిధంగుల సేవను శ్రీ కేసరిగారొనరించుచున్నారు. స్త్రీ పురోభివృద్ధిపై మనసుంచి, స్త్రీల శక్తి సామర్థ్యములను రేకెత్తించి, వారి కుత్సాహ గర్భిత ప్రోత్సాహ మొసగుచు, వారి రచనలకు ప్రధానపీఠ మనదగిన "గృహలక్ష్మి"ని ఆంధ్ర జనయిత్రీ పూజాగృహమున స్థాపించి విచక్షణ దృష్టితో విదుషీమణులను గుర్తించి, యశస్తిలకలను బహూకరించుచు ఆంధ్రుల భాగ్యవశమున తాము జీవించినంతకాలము మాత్రమే కాక, ఆంధ్రశారద మనియున్నంతకాలము స్వర్ణకంకణ మహోత్సవముజరగు సుస్థిర వ్యవస్థ మొనరించి, డాక్టరు కేసరిగారు అసంఖ్యాకుల కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు. ఆంధ్ర సాంస్కృతిక చరిత్రలో స్వర్ణాక్షరములలో తేజరిల్లు నామములలో వీరి నామ మొక్కటియై వెలయుననుట తథ్యము.

మన విదుషీమణులలో పలువురీవరలో శ్రీ కేసరిగారివలన స్వర్ణకంకణ బహూకృతినందిరి. ఈ సంవత్సరమున నీ సన్మానమునందు విదుషీమణి శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు దేవీమందిరమున నధివసించి పూజచేయుటయందీవరలోనే ఆరితేరిరి. దేవీవ్రతమహిమను పైన నుల్లేఖించితిని. దేవీభాగవతమందలి భావశబలత నెరిగి, దేవీ సంస్తుతి యందలి క్రియాసఫలతను గ్రహించి, ఆర్యనారీ శిరోమణులకు స్వతస్సిద్ధమైన కంకణము నీవరలోనే తమమణికట్టునకు కట్టుకొనిన విదుషీమణి నేడీజాంబూనద కంకణమునందుట ముదావహము. దేవీభాగవతమందలి భావవిభూతిని హృదయ సంపద జేసికొనిన సీమంతినీ చూడామణి నేడీ ప్రసాదమునందుట ప్రమోదకరము.

ప్రధాన పీఠము నలంకరించిన ఆంధ్ర సరస్వతిమ్రోల పలువురు విదుషీమణులు చేరి సంయుక్తవ్రతమున పాల్గొనుచు మధుర మంజుల నిస్వనమున ఆనందగీతిక నాలపించుచుండ ప్రమోదభరిత స్వాంతులు కాని వారెవరు? స్వర్ణోత్సవమందలి భావమహిమను హృదయంగమ మొనరించుకొని మఱిమఱి మురియని వారెవరు?

# త్యాగసేవాసక్త విద్యాసుందరి బెంగుళూరి నాగరత్నంగారి అభినందన సందేశము

గృహలక్ష్మి స్వర్ణకంకణదాతకు, కంకణగృహీతకు సద్గురు త్యాగరాజ స్వాముల వారిని, శ్రీరామచంద్రమూర్తిని ధ్యానగాన భజనలతో పూజించి వారి అనుగ్రహముతో మనసులో దోచిన ఆనంద సుధారసములోలుకు దివ్యదీవనల సమర్పించుకొనెదను.

శ్రీ దాన దయాశీల ఆంధ్రదేశ తిలకము శ్రీ డాక్టరు కేసరిగారు, శ్రీమతి వావిలికొలను పద్మాసనమ్మ బి. ఎ. గారి అధ్యక్షత వహించియుండు దివ్యాలంకార కేసరీకుటీర దేవేంద్రసభలో గూడియుండు స్త్రీ పురుష విద్వద్బృంద రసిక భక్తవరుల మధ్యలో ఈ నారీశిరోమణి సార్థకనామధేయ స్థానాపతి సత్యనారాయణశాస్త్రిగారి ఈడు, జోడు, తోడై సమస్త కార్యకలాపములలో కలసి మెలసియుండు సహధర్మచారిణి అంతేనా? వివేకవతి, విద్యావతియైన మేనత్త పాపమ్మగారి ప్రేమవలన మేనునే అనేక సద్గ్రంథములచే అలంకరించుకొనియుండు కవిజనులు శిరఃకంపనముతో మెచ్చుకొను కవయిత్రి, సద్వంశజాత, సత్పుత్రి పుత్రుల బడసిన. భాగ్యవతి, సంతుష్టిజెందిన నిరాడంబర జీవియని తెలిసికొనుటకు సంగ్రహ జీవితమును చక్కగా చదివినవారికి మార్గదర్శకముగ నుండును. ఇట్టి విశాలనేత్ర, విశాల హృదయమ్ముగల సాధ్వీమణి శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారి మృదుహస్తములకు బహూకరించు దానకర్ణుని ఓడించిన - ఎట్లు? కర్ణుడు దుర్యోధనమహారాజుగారి సంపదను ఇచ్చువచ్చినట్లు దానముజేసి దానకర్ణుడనిపించుకొనెను. మన కేసరిగారు స్వార్జిత విత్తమును పట్టువదలక నడిపించుచుతూ చూచి ఆనందించుచుతూ శ్రీశారదా మాధవి లావణ్య వసంతకుమారి కుమారులతో పెక్కేండ్లు ఆరోగ్యముగ బ్రతికి విదుషీమణులకు స్వర్ణకంకణములు తొడగవలెను. భక్తితో స్వర్ణకంకణమును అంగీకరించి ధరించిన శ్రీ రుక్మిణమ్మగారు బిడ్డలు, పాపలతో దీర్ఘసుమంగలిగా నుండవలెను - అధ్యక్షత వహించిన శ్రీ పద్మాసనమ్మగారు, గూడియుండు సభికులందరు చిరాయురారోగ్యైశ్వర్య వంతులై నిజమైన దేశభక్తులై ఐక్యమతదీక్షా కంకణబద్ధులై దేశరాజకీయ స్వాతంత్ర్యము లందుకొని ధన్యులై కాలవర్షమునొంది దేశసుభిక్షమును కనులారచూచి ఆనందించ వలెనని త్యాగరాజాశ్రమములో త్రికాలముల నాప్రార్థన.

——(౦)——

# గృహలక్ష్మీ స్వర్ణకంకణ ప్రదానోత్సవానికి

శ్రీకరముగనిల ఘనకో । భాకరముగ లలితకళల - ప్రాభవమొప్పన్
ప్రాకటవైభవకీర్తుల । జేకొని వర్ధిల్లుసతము - శ్రీగృహలక్ష్మి.

శ్రీవిద్యాగురుపీఠమై శుభదమై - శ్రీకాలవాలంబునై
భావస్ఫూర్తిని భారతావనినివి - భ్రాజిల్లుచున్ నిత్య సం
సేవన్ జేయుదు వాంధ్రవాణికియశః - చిహ్నంబు నీదాటచే
శ్రీవిస్ఫార జయంబుగాంచుమిలనా - రీలోకసంధాత్రివై.

లలనల్ ప్రీతిలిఖించి పంపుమధురా - లాపంబుతో పద్యముల్
బలువ్యాసంబుల సంతరించుకొనిస - త్ప్రావీణ్యతన్ బొందిస
త్కళలన్ ఖ్యాతివహించినావనగవి - ద్యాధీనిధుల్ మెచ్చరే
ఇలలోనన్ గడుమోదమొందుచునుని - న్నెంతేని కీర్తింపరే.

విజ్ఞాన సంపత్తి - విబుధజనప్రీతి । గ్రాలుగావుతగృహ - లక్ష్మియనగ
భావిసౌభాగ్యసం - పత్కరంబై ధాత్రి । రాణించు నీగృహ - లక్ష్మి కలిమి
మహిళామణులదివ్య - మంగళాశీస్సుల । వర్ధిల్లుగాతనీ - వసుధయందు
భాగవతామ్నాయ - భారతమ్మునువోలె । కొనియాడబడుగాక - కోవిదులచె.

సరసభావసముజ్జ్వల - సారమనగ । కీర్తిన్ నిల్పనలశుక్ర - తారయనగ
కలిమికల్యాణతోరణాల్ - గట్టుకొనుచు । పెక్కువర్షంబులిలపయి - పేరుగాంచి.

దేవి ! భాగవతము స । ద్భావము లింపొందునటుల - ప్రాసితివమ్మా
నీవైదుష్యము మెరయగ । కోవిదులత్యంతప్రీతి - కొనియాడిరిలన్.

తెనుగుకవయిత్రులను - తీర్చిదిద్దగల్గు । ఆంధ్రభాషా పరిజ్ఞాన - మలవరించు
కొనుట నీశక్తిసామర్థ్య - మనగవలయు । శ్రీమతీ-రుక్మిణీసతీ - చెలియమిన్న.

శ్రీ కేసరి ప్రశంస:

ఆంధ్రభాషాభివృద్ధి దీ - ర్ఘాయువృద్ధి । పృథుతరారోగ్య సమృద్ధి - ప్రియ మెలర్ప
ఆర్య కేసరివర్య నీ - కనవరతము । మాధవుండిచ్చుగాతయి - తోధికముగ.

# కవయిత్రులు, కవికుమారులు అంపిన పద్యరత్నములు.

"తొల్లి" శ్రీకృష్ణరాయలు - యుల్లమలర । కవులబోషించెనీవిపుడు - కవులకళల
గాయకమణులను స్వర్ణ - కంకణముల । బహుళసత్కారములకీర్తి - బడసినావు.

బుధుడవు మాన్యుడా మహిత - పూజ్యుడవున్ గృహమేధివాటచే
మధురతర ప్రసంగములై - మానసలక్ష్యముగా నొనర్చినావు నీ
పృథుతరశేముషీగరిమ - పెక్కుశుభంబుల గూర్చుగాత । వే
విధములగాచుగాత । పృథి - వీస్థలి శంకరుడెల్లవేళలన్.

గిడుగు లక్ష్మీకాంతమ్మ

♦ ♦ ♦ ♦ ♦ ♦

శ్రీపతినైజవీక్షణ మరీచసుధారసధార పాప సం
తాపము వాపతద్విమల మంజువిలాసము, వాలుఁజూపులన్
తేపకు తేపకున్ గని, యుదీర్ణమనంబుననుండు, లక్ష్మి స్థా
నాపతి రుక్మిణాంబను జనస్తవనీయచిరాయుఁ జేయుతన్.

సారగోదావరీతీర గ్రామమ్మున నుత్తము లింటిలో నుద్భవించి,
ఆనాఁడు మొదలుగా మేనత్తయాజ్ఞల విద్యావిశాల వివేక మెఱిఁగి.
రామాయణాది సద్గ్రంథముల్ పఠియించి పరమసాహిత్య సంపదనుగాంచి,
కావ్యనాటక నాటికా రూపగద్య పద్యాత్మికమైన కావ్యాలువ్రాసి,
ఆంధ్రకాంతల మేల్బంతివైతివమ్మ పలుకుజవరాలి పాదసేవాఫలమ్ము
ననుభవించితివమ్మ యియ్యాంధ్రభూమి మృదులగుణవల్లి ! శ్రీరుక్మిణీ ! మతల్లి.

కలవాణీ మృదుపద్యగద్య కవితా కల్యాణి లాస్యంబు, వి
జ్ఞులచేతో మణిమందిరాంగణముల్ శోభిల్లఁగాఁజేసి, కీ
ర్తిలతా మంజుల కాయమాన పరివృద్ధిన్ గన్న ఓ తెల్గు, కో
కిల ! స్థానాపతి రుక్మిణాంబికకుహూక్రీడల్ విరాజిల్లుతన్.

ఏపురమందునైనగలదే! ఇటువంటి బహూకృతంబు, స్థా
నాపతి వంశకీర్తి గణనంబును, కోట నృసింహ కేసరి

శ్రీరాజేంద్ర మహాత్మపండిత సుధీ శ్రీవైభవా క్రాంతనా
నారాజ్యస్తుత ధీర భారతమహీ నారీకుమారీ! లస
త్సారస్వామృత దానలబ్ధ నవభాస్వత్కీర్తి ముక్తావళీ
హారా! కేసరి స్వర్ణకంకణ గృహీతాబ్జేక్షణీ! రుక్మిణీ!

నీవైదుష్య లియజ్ఝరీ కనకపఙ్క్తజాత సందోహమే
ప్రోవై కేసరి స్వర్ణకంకణముగా రూపొంది ముంజేతి సొ
మ్మై వైశాఖ కవిప్రశస్తికొక నూత్నాంకంబుఁ జేకూర్చె ఆ
శ్వైశద్యముగాదె సత్కవిమనీషా విస్ఫురచ్చంద్రికల్.

మొల్ల తరిగొండ వెంకమ్మ ముద్దుపళని। మొదలుగాగల విమలోక్తి సుదతులటులు
కలుదక్కిన తెలుఁగుసీమలను మేలు। కొలుప మ్రోయింపు తెల్గువెల్గులనగార.

గృహలక్ష్మిని కంకణమిడి। గృహలక్ష్మి బహూకరించె నెయ్యడనైనన్
గృహలక్ష్మి బుద్ధివిభవము। గృహలక్ష్మికెఁగాక గ్రాహ్యమే! యన్యులకున్.

రేపును మాపు పండితపరీత మహాసభలందు సత్కవి
త్వోపమ భూరికంకణ బహూకృతులందుచు శ్రావ్య కావ్యదీ
క్షా పరతంత్రవై సిరులు సంపదలందుచు గ్రాలు మమ్మ స్థా
నాపతి రుక్మిణమ్మ యెలనాగలలో తలమానికంబువై.

శ్రీ ఎన్ని అప్పలరాట్కవి (విశాఖపట్టణం)

♦ ♦ ♦ ♦ ♦ ♦

బాల్యంబువైదీక వాతావరణమందు మునిగి, ప్రశాంత జీవనముగడపి
'రఘువంశ' మాదిగా ప్రాశస్త్యకావ్యముల్ చదువుచు, సంస్కృతసార మెఱిఁగి
'భారత' మాదిగా భవ్యపురాణముల్ పఠియించి, తెలుఁగుకబ్బంబు నేర్చి
చిన్నారి పొన్నారి చిఱుతనాటను, మేనయత్త కొడుకుతోడఁ బొత్తుఁగలిపి

జ్యోతితోఁగాంతి కూడినరీతిఁదోప। పసిడికిని, తావియబ్బిన భాతి నీవు
పుట్టిమెట్టిన యిండ్లకుఁబొలు పొసంగి। వెలఁగితివి; రుక్మిణీదేవి! శ్రీశుభాంగి!

భర్తృసేవయే, ముక్తిపథమని యెంచిన తరుణివి.! సాధ్వీమతల్లివీవు!
గృహకార్యములయందు గృహలక్ష్ములకు, మేలుబంతివై, వరలిన పడతివీవు!
మహిళల కాదర్శమగు, యోగ్యనడతల నొప్పిన - యొప్పుల కుప్పవీవు!
కావ్యముల్ పద్యాలు - కథలు నాటికలెన్నొ రచియింపఁగల్గిన రమణివీవు!

అమ్మరో! సాహితీసేవయందు, జీవితమ్ముఁగడపుచున్నావు; స్వార్థమ్మువీడి
కొమ్మరో! ధన్యురాలవు! కొమ్మ,-పైడికంకణము,-రుక్మిణమ్మ! సుఖమ్ముగొనుమ!

ఆనాడు రుక్మిణీసతి పూనికతోఁ పెండ్లియాడెఁ బాలుపుగఁ గృష్ణున్
ఈనాడు-రుక్మిణమ్మయె స్థానాపత్నిఁ బెండ్లియాడె సరసప్రేమన్.

నారాయణుఁడున, కృష్ణుఁడుగారే? యద్వైతమూర్తి ఘనులారయఁగన్
శ్రీరుక్మిణీశుడెప్పుడు నారాయణు, రుక్మిణమ్మనయమునఁ బ్రోచున్.

ప్రతివత్సరమును దప్పక నతిముద్దుగఁ బైడికంకణములఁ దొడుగుచున్
సతులకిడె; ముదము కేసరి యతనికి నారోగ్య భాగ్యమమరు; సతంబున్.

కల్లూరు అహోబలరావు

♦ ♦ ♦ ♦ ♦ ♦

శ్రీ కేసరికి సాటి నీకే - సరియగును; స్వర్ణకంకణదాన సరణిచేత
ఆ-కేసరినిమించి ఈ-కేసరి వెలసె; విద్యాలయారణ్య విహరణాన
ఈ-కేసగిని పోల నాకేశ్వరుని కాన? "గృహలక్ష్మి" ప్రేమనే గోరు-టొకటి!
లోధ్రామృతార్కుల లోకాన సృష్టించి ప్రజలాను రాగంబు బడయుటొకటి!!
తెలుగు బిడ్డలకియ్యెడ తెలుగు బడులు లేఁ లోపంబు పోదోల బూనుఁ టొకటి!!!
( ఈ కేసరినిపోల నాకేశ్వరునికాన? )

ఆయురారోగ్య భాగ్యంబు లందుకొనుచు నిండు నూరేండ్లు కేసరి యుండుగాత!

శ్రీ నారాయణుసతిగా మానినిమణి రుక్మిణమ్మ మహితా-వెలసెన్।
నానావిధ కవితలచే స్థానాపతివారికీర్తి ధరనిల్పంగన్.

దాతకెనయగు కేసరి ప్రీతిచూరగొనిన "గృహలక్ష్మి" కంకణ గుఱుతు కరము
కలము కలకాలమున వేగ కదలుగాత! దేవి-భాగవతరచనా దీప్తిమించి.

(సరిగమ పదనీలతో సంగీత పద్యం)

సరిసమ్మా! నీ-పద-దా-సరిని-గద! మరిమరి "సాని" సరిగాద్గాదా!
సరిగమపదని-గసరి-గా...సరి, గమనింపంగ-పాద సన్నిధి-పదమా॥

(గేసరి గమనింపంగ పాద సన్నిధి - ధనమా)

వచ్చిన వారలకును, కనిమెచ్చిన వారలకును, బహు, మేధావులకున్!
పుచ్చుకొనిన-పూజ్యులకును, ఇచ్చిన "కేసరికి" దేవుడిచ్చు శుభంబుల్॥

ఆంజి

♦ ♦ ♦ ♦ ♦ ♦

కవిస్థానాపతి సతివయి, కవితా కంకణ గృహీతగా నుతిగనుటన్
భువినీకెగాక మనదగు, కవితాసమితికిని గర్వకారణమమ్మా!

తొలతన్నికు విశాఖపట్నమున సాధ్వుల్ కంకణంబిచ్చి భా
సిలగా సర్వము సానుకూలమొనరించెన్‌గాని తత్కీర్తి వా
రలకున్ దక్కగ నీక కేసరియెతొల్తన్ నీకు నర్పించి యాం
ధ్రుల సంకీర్తన మందినాడు సుకృతాత్ముండౌట విద్యావతీ!

రాజిత గ్రంథరాజములు వ్రాసిన సత్కవితాసమాజమున్
పూజలొనర్చి స్వర్ణమయభూషలు మోజుగ రేపుమాపు నీ
రాజనమిచ్చురాజులు ధరాస్థలి బుట్టిరిగాని ప్రాజ్ఞకాం
తా జనమున్ సమాదర మొనర్చెదు కేసరిబోలు సద్యరో
భోజులు మెచ్చుకేని భువిపుట్టిరె - కానుక లిట్లుపెట్టిరే?

బిడ్డలగనిపెంచి విజ్ఞాన ధనము ప్రసాదింపగలది స్త్రీజాతికాదె
సతతము పతిసేవసలిపి సంతోషమ్ము సమకూర్పగలది స్త్రీజాతికాదె
మగలను భయద సంసారాబ్ధి దాటింప సహకరించెడిది స్త్రీజాతికాదె
రామాయణాది యుద్గ్రంథమ్ములనువ్రాసి ఖ్యాతిగాంచినది స్త్రీజాతికాదె

స్త్రీ జనాభ్యున్నతియె ప్రజాక్షేమమనుచు స్వర్ణవలయమ్ము వత్సర వత్సరమ్ము
తెలుగు కవయిత్రులకు ప్రసాదించి ప్రోత్సహించు కేసరి జన్మఫలించెనమ్మ!

పరికింగాని కాన్క లభియించని కేసరి కంకణమ్ము నీ
తీరుసదాల్చితన్న పరితృప్తి వహించుచు నింక నాంధ్రభా
షారమణీ సపర్యలనుసల్పుట మాత్రము మానబోక విి
స్ఫారిత గ్రంథరాజములువ్రాసి వెలుంగుమ వేవిధమ్ములన్.

శ్రీ సున్నం వీరరాజకవిగారు (కవితా సమితి)

♦ ♦ ♦ ♦ ♦ ♦

విద్వానితిహినామాస్తి। విద్వచ్ఛ్రమవిదాం నృణాం।
నశృతం నామలోకేఽస్మి। న్విదుషీ శ్రమవేదినాం॥

శ్రేష్ఠశ్శ్రీ కేసరీవిద్వా। న్వేత్తి శ్రీ విదుషీశ్రమం।
దవ్యర్థకరీ క్రియై కేతి। మత్వాఽదా ద్రాత్మకంకణం॥

శ్రీరుక్మిణ్యై సుధీమత్యై। యేనేయం రుక్మిణీధృవం।
అన్వర్థనామ్నా సంభూతా। స్వాధీనపతికా భువి॥

బహవస్సంతు విద్వాంసో। విదుషీ మానవర్ధకాః।
స్వార్జితేనైవవిత్తేన। భువి శ్రీకేసరీ వచ॥

భారత్యాం మహిళాశ్చాపి। యోషితో రుక్మిణీసమాః।
జన్యాసుర్బహుళాభూయో। జీవేయుశ్శరదాంశతం॥

శాండిల్యగోత్రజనుషా। వేంకట్రామేణ ధీమతా।
పంచరత్నమిదం ప్రోక్తం। విదుష్యా మానసే ముదా॥

లోకమున విద్వాంసుడనెడిపేరు, విద్యావంతుని, శ్రమనెరిగిన పురుషునకు వాడబడుచున్నది. విదుషియొక్క శ్రమనెరిగి, గౌరవించు పురుషుని ఏపేరున పిలువవలెనో కాన్పించదు.

సర్వశ్రేష్ఠులగు శ్రీ కేసరిగారు విదుషీమణుల శ్రమను, దేహతత్త్వములతో కూడ, పూర్తిగ గ్రహించిన వారగుటవలన, శ్రీమతి రుక్మిణియను విదుషీమణికి, స్వర్ణ కంకణమును బహూకరించుట మిక్కిలి కొనియాడఁదగిన విషయము.

ఇందుచే "నొకపని రెండు ప్రయోజనములను చేయుచున్నది" అను నార్యోక్తి ధృవపడినది. ఒకప్రక్క విదుషీమణికి తగిన సన్మానము జరిగెను. వేరొకప్రక్క యామె పేరు "రుక్మిణి" యని సార్థకము నయ్యెను. స్వకీయ ప్రజ్ఞావిశేషముచే నిట్టి సంఘటన సమకూరినది. ఇట్టిది స్వాధీనపతికలగు మహిళలకుగాక మిగిలినవారికి దుర్లభము. మరియు నిట్టి సన్మానమును చేయుటకును, శ్రీ కేసరివంటి విద్వాంసులై, విశేషముగ స్వార్జిత విత్తము గలిగిన సాహసముగల వారికిగాని సాధ్యము కాదు.

ఇటువంటి విద్వాంసులును, విదుషీసన్మానము నొందతగిన, భర్తతో కూడిన యోషరత్నములును, అనేకమంది యీభారతభూమిన జన్మించి, దీర్ఘాయుష్యముకలవారై వర్ధిల్లెదరుగాక. కరిమెళ్ల వెంకట్రామశాస్త్రి.

## స్తుతి

జయము జయమమ్మ గృహలక్ష్మి జయము జయము !<br>
విమలసాహిత్యవాహినీ ! కుసుమకోమలభాసినీ !<br>
మధుర మంజులభాషిణీ ! మహిళాభ్యుదయ ప్రదాయినీ !<br>
జయము - జయమమ్మ గృహలక్ష్మి - జయము జయము<br>
చిరకాలము వర్ధిల్లుమా ప్రియలక్ష్మి ! సిరులతోడ ! ॥జ॥

కవనమ్మల్లెడి వనితకున్ ఏడాదికొకమారు<br>
స్వర్ణకంకణమున్ బహూకరించు సారస్వతామతల్లివీవు !<br>
జయము జయమమ్మ గృహలక్ష్మి జయము జయము<br>
చిరకాలము వర్ధిల్లుమా ఆంధ్రలక్ష్మి సిరులతోడ ! ॥జ॥

స్త్రీల ఆరోగ్యభాగ్యమున్ పెంపొందింపఁజేయ<br>
విలసిల్లినట్టి సౌభాగ్యలక్ష్మివీవు !<br>
జయము జయమమ్మ గృహలక్ష్మి జయము జయము<br>
చిరకాలము వర్ధిల్లుమా భాగ్యలక్ష్మి ! సిరులతోడ ! ॥జ॥

ఫణిహారం వెంకటరెడ్డాచార్యులు.

# శ్రీమతి వావిలికొలను పద్మాసనమ్మగారు బి. ఏ.

(జీవిత చరిత్ర)



శ్రీమతి యమ్. సుశీల

స్వార్థరహితమయిన, నిరాడంబరమైన సంఘసేవాతత్పరులు బహుకొద్దిమంది. వారిలో శ్రీమతి పద్మాసనమ్మగారొకరు. అందుకనే ఆమె జీవితచరిత్ర తెలిసినవారు కొద్దిమంది.

పద్మాసనమ్మగారు నెమలివారి ఆడపడుచు. కొచ్చిదివాన్‌గిరీచేసి స్వర్గీయులైన శ్రీ నెమలి పట్టాభిరామారావుగారి కుమార్తె. పుట్టింది విద్యావంతుల కుటుంబంలో. పూవుకు తావి అబ్బినట్లు వారికి, స్త్రీత్వానికి ఆభరణాలైన విద్యతోబాటు లలితకళలన్నీ అబ్బినాయి.

ఈమె వావిలికొలను వెంకటరమణరావుగారి భార్య. శ్రీ వెంకటరమణరావుగారు ధర్మాదాయాల బోర్డు సూపరింటెండెంటుగా పనిచేసి రిటైరు అయినారు. వీరికి ముగ్గురు కుమార్తెలు. అందరూ ఉన్నతవిద్య నభ్యసించినవారు. పద్మాసనమ్మగారి అత్తింటివారు కూడా విద్యావికాసాలు కలవారవడంచేత, పట్టభద్రురాలవడానికి వివాహానంతరం సావకాశం కలిగింది. ఈమె మద్రాసు రాష్ట్రంలో రెండవ పట్టభద్రురాలు. మొదటి ఆమె కీ. శే. ఆచంట రుక్మిణి లక్ష్మీపతిగారు.

శ్రీమతి పద్మాసనమ్మగారికి సంఘసేవయందు ఆసక్తి విద్యార్థి దశనుండియే ప్రారంభమయింది. ఈసందర్భంలో పద్మాసనమ్మగారి పట్టుదలగురించి కొంచెం చెప్పాలి. 1914 వ సంవత్సరంలో కాబోలు క్వీన్ మేరీస్ కళాశాల స్థాపితమైంది. మహిళలకై ప్రత్యేక కళాశాల స్థాపితమవడం అదే మొదటిసారి. ఈ క్వీన్ మేరీస్ కళాశాల స్థాపనకు కృషిచేసిన ప్రముఖురాండ్రలో యీమె యొకరు. ఈ కళాశాలలోనుండి పట్టభద్రులైన మొదటిజట్టులోనిది యీమె. బి. ఏ. చదువుతూండగానే మద్రాసు విశ్వకళా పరిషత్తువారు వీరికి బంగారు పతకం ఆంగ్లంలో మంచిపరిచయమున్నసంగతి గుర్తించి ఒసగారు.

పట్టభద్రురాలై గృహిణులందరి మోస్తరుగానే సంసారం చేస్తూన్న, ఈమె ఆశయాలు, లక్ష్యాలు ఉన్నతములయినవి. తాను అభ్యసించిన విద్య ఉద్యోగముల సంపాదనకు కాక ఆనాడు విద్యాగ్రంధము లేక, నిస్సహాయస్థితిలోనున్న విశేష మహిళాలోకాన్ని ఉద్ధరించవలెనని పూనుకొనిన నారీమణులలో నీమె యొకరు. అందుకుగాను యిప్పుడు అఖిలభారత మహిళాసభగా వ్యవహరించబడుతున్న సంస్థను మొట్టమొదట స్థాపించి అధ్యక్ష కార్యదర్శినులుగా నిర్వహించినవారు కజిన్సుసతి, శ్రీపద్మాసనమ్మగారలు. అనేక సంవత్సరములు కార్యవర్గ సభ్యురాలుగాను, కాకినాడలో జరిగిన మహాసభకు అధ్యక్షురాలుగా నుండి మహిళా ఉద్యమవ్యాప్తికి విసుకూ విరామము లేకుండా పనిచేశారు. స్త్రీ విద్యావ్యాప్తికి యీమె చేసినకృషి అపారము. ఈమె కార్యదక్షత, పట్టుదల, మహిళా ఉద్యమము నలుదిశల వ్యాపించుటకు, అభ్యుదయమునకు అమోఘంగా ఉపకరించింది.

ఆరోజులలో ఆమె ఉద్యోగము చేయదలచుకొనినట్లయినచో ఉన్నతోద్యోగము సులభముగా లభించి యుండెడిది. కాని ఉద్యోగాలకు ప్రాకులాడే ముందు మన ఆర్థిక పరిస్థితుల కనుగుణ్యంగా నారీమణులు తమ యిండ్లను చక్కబెట్టుకోవాలని నమ్మేవారిలో పద్మాసనమ్మగారొకరు. ఈమె దైనిక జీవితము, ఆదర్శలక్ష్యాలు మహిళాలోకానికి ముమ్మాటికి మార్గదర్శకములు. ఈమె సంఘనిర్మాణ చాతు

ర్యము అమోఘమైనది. నెల్లూరు జిల్లా బోర్డు ప్రథమ సభ్యురాలుగా నెన్నుకోనబడిరి. ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు సెనేటు మెంబరుగా 1932.38 వరకూ వుండిరి. గుంటూరుజిల్లా విద్యాకమిటీ సభ్యురాలుగా పాటుపడ్డారు. అవకాశము చిక్కినప్పుడెల్లను ప్రతిజిల్లా కేంద్రములో కాలేజియు, ప్రతి నగరంలో ఉన్నత విద్యాలయము స్థాపించవలయునని ఆందోళన చేసిరి. దానిఫలితంగానే గుంటూరులో లేడీహాంపు కళాశాల స్త్రీలకు ఏర్పడినది.

ఆమె అనేక పబ్లిక్ సంస్థలలో పాలకవర్గ సభ్యురాలుగా పనిచేసిరి. ఆంధ్ర మహిళా సంఘం తరఫున అభ్యర్థిగా అఖిల భారత మహిళాసభ సమావేశాలలో పాల్గొన్నారు. పద్మాసనమ్మగారికి శిశు పోషణయందు, బాలబాలికలకు విద్యనేర్పుటయందు, వైద్యసహాయ విస్తరణయందు ఆసక్తి మెండు.

ఆమె సంఘసేవయందలి ఆసక్తితోబాటు గృహనిర్వహణమునందలి ఆసక్తి, నిరాడంబరమైన జీవితం కొనియాడతగినవి.

ఈమె పెద్దముత్తైదువ, పూజ్యురాలు. ఇప్పటికీ వృద్ధాప్యం మీద వచ్చిపడుతూన్నా, చురుకుతనంతో, ఉత్సాహంతో, ఆచిరునవ్వుతో, అన్ని ఉత్సాహ కార్యక్రమాలలోనూ పాల్గొంటూనే వున్నారు. వయస్సుతో త్వక్కు ముదురుతూన్నా, మనస్సుమాత్రం ఎప్పటిలాగే, హరిణం చలాకీతో పనిచేస్తూనే వుంటుంది. ఈమోస్తరుగా పద్మాసనమ్మగారు మహిళాభ్యుదయానికి, చంద్రునికో నూలుపోగు అన్నట్లు తమకు తోచినరీతిని పాటుపడుతున్నారు.

# సందేశములు



డాక్టరు. కె. యస్. కేసరిగారికి కనుపర్తి వరలక్ష్మమ్మ అనేకనమస్కారములు.

అయ్యా! తాము దయతో పంపిన స్వర్ణకంకణోత్సవ ఆహ్వానపత్రిక చేరినది. విదుషియు, కవయిత్రియు, ఆధునికాంధ్రకవయిత్రీ మణులలో నొక్కరుఅయిన శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారికి ఈ సంవత్సరము స్వర్ణకంకణము బహూకరించు చున్నందుల కెంతయు ఆనందముగానున్నది. కంకణగృహీతలసంఖ్య సరమై హారమై నానాట సంఖ్యాధిక్యతను చెలువొందుచున్నందులకు ముదమందుచున్నాను - సోదరి రుక్మిణమ్మగారికి నా అభినందనలు. తా మిటులనే ఆరోగ్యవంతులైయుండి ప్రతియేట స్వర్ణకంకణ సత్కారములచే నాంధ్ర విదుషీమణుల చిరకాలము సత్కరించునటుల భగవంతుడనుగ్రహించునుగాక.

కనుపర్తి వరలక్ష్మమ్మ, బాపట్ల.



బ్రహ్మశ్రీ కే.యస్. కేసరి మహాశయుల చరణసన్నిధికి. మీ పుత్రికాసమాన గంటి కృష్ణవేణమ్మ ప్రణమిల్లి. తాము ఈ సంవత్సరము గృహలక్ష్మి స్వర్ణకంకణము శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారి కొసంగునట్లు పత్రికవల్ల నెరింగితి. మిక్కిలిసంతసము. తగినవారినరయుట మీకేతగును. తమయారోగ్యము చక్కగానున్నదని తలంతు. మాతృశ్రీ అమ్మగారు క్షేమమేగదా! మీ ఆరోగ్యమునకై పరదేవికి హృదయపూర్వకముగా కేలుమోడ్తును. మరల తమరిని సందర్శింప నుత్సాహినై యున్నాను. దైవకృప మీయాశీర్వాదములు గలిగినచో శీఘ్రముగనే ప్రాప్తించునని తలంతు.

గంటి కృష్ణవేణమ్మ, ప్రొద్దుటూరు.



శ్రీ కేసరి మహాశయులకు, వందనములు.

గృహలక్ష్మి స్వర్ణకంకణోత్సవాహ్వానము చేరినది. నాకు కడుకూర్చు మిత్రరత్నమును, కవయిత్రీకులాలంకారమును అగు శ్రీమతి సోదరి రుక్మిణమ్మగారికి ఈ యేడు తాము స్వర్ణకంకణ మీయదలచుట చాలాసంతోషము. ఇట్లె యీ యుద్యమము ప్రతివత్సరమును జరుగునట్లు పరమేశుడనుగ్రహించి అనేకులగు స్త్రీ శిరోమణుల కుత్సాహప్రదమగును గాక అని ప్రార్థింతును.

ఈ యుత్సవము శుభాంతమగునట్లు సర్వేశుడు కరుణించును గాక. ఉత్సవమునకు స్వయముగా రాజాలనందులకు మన్నింపుడు.

ఊ. లక్ష్మీకాంతమ్మ, బాపట్ల.

శ్రీ కేసరిగారికి,

మీగారాబుపట్టి 'గృహలక్ష్మి' సోదరి రుక్మిణిని తన గృహాంగణమునకు ఆహ్వానించినది. విద్యావతి, ధీరమతి, గుణవతియైన రుక్మిణి సాంగత్యమామెకోరుట సహజము.

మీకు మీ పుత్రికయందుగల ప్రేమ అసమాన్యము. ఆమెనేస్తము కోరిన సఖిని మీరు స్వర్ణకంకణముచే అలంకరించి గౌరవించుచుంటిరి. మీపుత్రికావాత్సల్యము అద్భుతము. మీకు "స్త్రీ" యందుగల అభిమానము అభివందనార్హము. మీచే స్వర్ణకంకణాలంకృతురాలైన శ్రీమతి రుక్మిణమ్మగారు గౌరవార్హులు. మీ ముద్దులబిడ్డ అభిమతములు దీర్చుచూ, మీకునూ హృదయానందము గలిగించు 'మాతృపూజను' ఈ విధముగా నిర్విఘ్నముగా ఏటేట జరుపుటకు భగవంతుడు మీకు సంపూర్ణ ఆయురారోగ్యముల నొసంగి తోడ్పడుగాక.

మీ శ్రేయోభిలాషి
లక్ష్మి రఘురామ్, మద్రాసు.

♦ ♦ ♦ ♦ ♦ ♦

ఆర్యా, నమస్సులు,

తాము దయతో పంపిన శ్రీ స్థానాపతి రుక్మిణమ్మగారి జీవితచరిత్రమును చూచినాను.

నేటి సుప్రసిద్ధ పండిత కవయిత్రులలో నొకరగు శ్రీమతి రుక్మిణమ్మగారికి గృహలక్ష్మి స్వర్ణకంకణము సమర్పించి సత్కరింపనున్నారని తెలిసికొని చాల సంతోషించితిని. శిరీషకుసుమ సుకుమారములగు భావములు, కమనీయమగు పలుకులుగలిగి యీయమ కవితారచనలు ఆధునిక వాఙ్మయమున నొకవిశిష్టస్థాన మలంకరించియున్నవి. స్వర్ణకంకణ గ్రహణమున కీమె యన్నివిధముల తగియున్నారనుటకు సందేహములేదు. ఈమెకు నాఅభినందనములు.

ఆంధ్రస్త్రీల యభ్యుదయమునకై యపారముగ పాటుబడుచున్న శ్రీ కె. ఎన్. కేసరిగారికి నాకృతజ్ఞతా పూర్వక వందనములు.

ఐ. రాజ్యలక్ష్మి, మద్రాసు.

♦ ♦ ♦ ♦ ♦ ♦

పూజ్య మహాశయా!

గృహలక్ష్మి జయంతీ మహోత్సవపత్రికను నిన్నరాత్రే చూడగల్గాను. మీ ఆహ్వానానికి కృతజ్ఞతలు.

మహిళాభ్యుదయానికి తామొనరించుచున్న సేవ - ప్రోత్సాహములు నిరుపమానములైనవి - గీతాచార్యులగు శ్రీ కృష్ణపరమాత్ముడు మిమ్మనుగ్రహించి ఆశీర్వదించు గాక !

యన్. శ్రీ కంఠమ్, ఆళ్లగడ్డ.

♦ ♦ ♦ ♦ ♦ ♦

శ్రీ కేసరిగార్కి నమస్కారములు—తమ ఆరోగ్యము అనుకూలము అని తలంచుచున్నాను.

తామంపిన - "గృహలక్ష్మి జయంతి" ఆహ్వానపత్రిక-అంతకుముందుపంపిన శ్రీమతి రుక్మిణమ్మగారి జీవితచరిత్ర - రెండున్నూ చేరినవి. ఈ క్రొత్త అవతారంలో జమాబంది లెఖల పనితొందర్లవల్ల రావలసియు రాజాలనైతిని ; కాన క్షమింపగోరెదను.

ఈసారి శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారికి స్వర్ణకంకణము సమర్పింపబడుట నాకత్యంతము సంతోషకరమగు విషయము. అందుకు ముఖ్యకారణములలో నొకటి - ముఖ్యాతి ముఖ్యము - నాకు జన్మాంతరములలోకూడ పూజనీయులగు కీ॥ శే॥ మారేపల్లి రామచంద్రశాస్త్రికవిగారి చిరకాలాభిలాషఇది. ఇకనామె అర్హత యందురా - ఏనాడో కవిత్వతత్వ విచారదక్షులు కీ॥ శే॥ సి. ఆర్. రెడ్డిగారు ఆమె కవితా మాధురికి ముగ్ధులై - అక్షర కంకణమును ఆమెకు సమర్పించియున్నారు. మీరిప్పుడా కంకణమును స్వర్ణమయమొనర్చి మెరుగుపెట్టుచున్నారు. రెడ్డిగారన్న సామాన్యులా ? ప్రాచీనకవుల నెందరినో - భారతకవులనుతప్ప అందరి ననవచ్చు - పింగళి సూరనకు దిగదుడుపుతుడిచి పారవైచిన విమర్శకాగ్రేసులుగదా !- ఉత్సవము జయప్రదముగా నెరవేరుగాక.

రా॥ వెంకటప్ప, టంగుటూరు.

♦ ♦ ♦ ♦ ♦ ♦

మహాశయా ! నమస్తే,

తమరు దయతోబంపిన ఆహ్వానమందినది. 2-3-52 తేదిన 'గృహలక్ష్మి' జయంత్యుత్సవము విజయవంతముగ జరుగునట్లు పరమేశ్వరుని ప్రార్థించెద.

1952 సంవత్సరమునకు కంకణ ప్రదానము బడయుచున్న శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారికి నావందనములు తెలుపవేడెన. భాషాసేవ యొనర్చుటకై పరమేశ్వరుడీ సాధ్వికి ఆయురారోగ్యముల నొసంగి బ్రోచెడినిగావుత.

(154.వ పేజి చూడుడు.)

# శ్రీ స్థానాపతి రుక్మిణమ్మగారి సంగ్రహ జీవితం



"పదలాలిత్యము, వర్ణశుద్ధియును, శబ్దస్థైర్యముఁ, మంగళా
స్పదభావంబును, రాజ్యయోగ్యతయు, దోషస్ఫూర్తి రాహిత్యముఁ
సదలంకార విశేషముఁ గలిగి విశ్వప్రాణ సౌభాగ్య సం
పదమై తేజియపోలి క్రాలవలదా! పద్యంబు హృద్యస్థితిఁ. ॥

స్థితిలో కవితల్లు నేటి తెనుగు కవయిత్రులలో శ్రీ రుక్మిణమ్మగారు ఒకరు.

ఈమె పశ్చిమ గోదావరి జిల్లాలోని నిడదవోలులో 1915-వ సం॥ సెప్టెంబరు 28 తేదీని పండిత కుటుంబమున జన్మించారు.

పుట్టినింటివారు - శ్రీ కాశోళపువారు; వెలనాటి బ్రాహ్మణులు; ఆపస్తంబ సూత్రులు; ఆత్రేయ సగోత్రులు; వేదాధ్యయనపరులు; వైదిక కర్మాచరణులు; నైష్ఠికులు; కృషీవలులూను. తండ్రి - పురుషోత్తము; తల్లి - గరుడమ్మ.

ఈ పుణ్యాదంపతుల సంతాన మేడుగురిలో రుక్మిణమ్మగారు మొదటివారు. ఆ దంపతుల కంతకుముందు సంతానముకలిగి నష్టపడుచుండుటచే ఒకానొక పరమ యోగి సందేశానుసారమున నీమెకు - 'గోపాల'మని పేరుపెట్టిరి. పేరుకు తగిన ట్లీమె పుట్టినదిమొద లాగృహము నందమందిరములాగు ధనధాన్యములతో, పాడి పశువులతో కలకలలాడుతూ పండితులయిన అతిథీ అభ్యాగతులకూ, బంధుమిత్రాదులకూ మరింత స్థానమయింది. గోపాలునివలె - గోపాలము మెరుగు చామనచాయ దేహకాంతితో - విశాలములయిన నేత్రములతో నందర దయకు పాత్రమై గారాబముగ బెరుగుచుండెను. ఉషఃకాలమగుసరికి శ్రావ్యమగు వేద ఘోషతో, దధిమథన ధ్వనులతో ప్రతిధ్వనించే ఆ గృహ సౌభాగ్య మరయవలసినదేగాని - వ్రాయ వలను కాదనిన నతిశయోక్తి కా నేరదుకదా !

## బా ల్య ము - వి ద్య

గనుక నామె బాల్యమంతయు వైదికసాంప్రదాయ వాతావరణముతో-మనోహర కార్యకలాపములతో పరమ ప్రశాంతముగ సాగుచుండెను. అయిన - నామె విద్యాబుద్ధులకు విశేషముగ సాయపడినది ఆమె చిన్నమేనత్త పాపమ్మగారు. పాపమ్మగారు బాలవితంతువు. ఈమెకు - భారత భాగవత రామాయణాది పురాణగాథలు వినడమన్నా - దృశ్యములలో ఆయాకథలు చూడడమన్నా అమితప్రీతి. ప్రీతిగల ఆమె - పురాణాలు వినడానికీ, నాటిగొల్ల - భామ కలాపాలూ, తోలుబొమ్మలాటలూ, మున్నగునవి చూడడానికీ తనతో మేనకోడల్ని తరచుగ తీసుకువెడుతూ వుండేవారు.

అలా చిన్నతనములో మేనత్తతో విని, కనిన పురాణాదులందలి కొన్ని పద్యములనూ, పాటలనూ రుక్మిణమ్మగారు ఇంటికడ మరల యథాతథంగా చదివి-పెద్దల నాశ్చర్యమగ్నులుగాచేసి వారి యాశీస్సు లందుకొనేవారు. మేనగోడలి గాత్రమాధుర్యానికి పాపమ్మగారు పరవశురాలవడమే కాకుండా - ఆమెను ఎక్కడెక్కడికో తీసుకొనిపోయి - అధ్యాత్మ రామాయణమందలి కీర్తనలూ, గుమ్మడిపాటలూ, గరుడాచల యక్షగానమూ నేర్పించిరి.

విధివత్తుగా అయిదవయేట అక్షరాభ్యాసమైనది మొదలు రుక్మిణమ్మగారు బోర్డుబాలికా పాఠశాలలో అయిదవ తరగతివరకూ చదువుకొని - ఆపిమ్మట పినతాత కుమారునితో కలిసి ఇంటికడ సంస్కృత మభ్యసించడం మొదలుపెట్టి - రఘువంశ, కుమార సంభవములందలి కొన్ని సర్గములును, మేఘసందేశమంతయును పూర్తిచేసిరి. కావ్యపాఠాలతో పాటు అప్పుడప్పుడు తెలుగు భారత భాగవతాదులుకూడా పఠించుచుండిరి. అట్టి సాహిత్యాభిరుచి ప్రచురముతో నామెలో ప్రకృతి పరిశీలనాజ్ఞాన మభివృద్ధి నందసాగెను. ఆమూలంగా సుందర సంధ్యారుణ కాంతిజాలములూ, కనత్కమనీయ కాదంబినీ సమంచిత నీలాంబరమూ, పచ్చని వరిపైరులతో, తరులతా గుల్మాదులతో, కలకలలాడు విహంగ తతులతో - చల్లని గోదావరీనదీ దర తరంగ మాలికలతో చుట్టుకున్న ధరాతలమూ మున్నగు మనోహర గంభీరభావచిత్ర దృశ్యాలామె స్నిగ్ధముగ్ధ హృదయ ఫలకంలో ప్రతిఫలించడమేకాదు - హత్తుకుపోయాయి. అంత నామెలోని బాలాంతర్వాణీ వీణా తంత్రీరుతులు గీతారాగాలాపములకు దారితీయ నారంభించెను.

## వి వా హ ము

అలా అల్లారుముద్దుగా నభ్యుదయమందుచున్న రుక్మిణమ్మగారిని శ్రీ స్థానాపతి సత్యనారాయణ శాస్త్రిగారికిచ్చి-1928-వ సంవత్సరమున విధ్యుక్తముగా వివాహముజేసిరి. శాస్త్రిగారామెకు పెద్దమేనయత్త కుమారులు. చిన్నారి పొన్నారి చిరుతకూకటి నాటిప్రియులు. చిన్ననాటి ఆటపాటల సమయములో బావ సంబోధించిన 'రుక్మిణీ!' పదమునే పరమపదమయిన నామముగాబెట్టుకొని వ్యవహరించుచున్న ఆమెకు - ఆయనయందున్న అనురాగాతిశయమెట్టిదో మనమూహించుకోవచ్చు. మరియు - నామె గుణగణములతో పతినివలచి వలపింపచేసుకున్న తపస్వినియనికూడా చెప్పకతప్పదు.

శాస్త్రిగారు - భారద్వాజగోత్రులు; తల్లి - వెంకటరత్నమ్మ; తండ్రి - త్రిపురాంతకము. వీరిది తొలుత విశాఖపట్నంజిల్లాలోని 'జామి.' రెండుశతాబ్దులయి వైద్యవైదికవృత్తిగా విశాఖపట్టణం స్థిర నివాసంగా వచ్చారు.

స్థానాపతి - అనగా రాయలకాలమున - (Ambassador) 'రాయబారి' అని చరిత్రా నిఘంటువులూ చాటుతున్నాయి. ఇది పౌరుషనామము. ఈ ఇంటిపేరు వారు తెలుగు బ్రాహ్మణశాఖలోగాని - మరేవర్ణములోగాని ఉన్నట్లింతవరకూ తెలియడంలేదు. కాగా - రుక్మిణమ్మగారి నిమిత్తం శాస్త్రిగారు స్థానాపతి వారికి దత్తువచ్చారు. కావుననే వీరు చిన్నతనమున మేనమామ యింట తరచుగ ఉంటూ ఉండడమూ, కవయిత్రికి హృదయాధినాథులు కావడమూ సంభవించింది. వీరు - సంస్కృతమున పండితులు; విమర్శకులు; రసజ్ఞులూను. కాబట్టే - అత్తవారింట అడుగు మోపినంతనే - శృంగార నైషధంలో - నలదౌత్యభంగములోని.

"ఆదిఁ బరోపకారపరులై చరియించినయట్టి యాంజనేయాదులఁ బోలఁ నైతి; ... ..." పద మండలి కాలసమన్వయమెట్లని ప్రణయినివేసిన ప్రశ్నకు శాస్త్రిగారు చకితులయి - ఆమె విద్యావ్యాసంగానికి వలసినంత దోహదమిచ్చారు.

పుట్టిమెట్టిన వంశాలురెండూ పండిత సాంప్రదాయకమైనవి గనుక రుక్మిణమ్మగారి కవితాకన్య వివిధాలంకార రుచులతో - ముద్దులొలుకు నడలతో, కలికిచూపుల కోపులతో ప్రౌఢయై సాక్షాత్కరించి స్వైర విహారమొనర్చు టబ్బురము కానేరదు.

## కవిత్వము

పువ్వుతో తావి, జ్యోతితో కాంతి బయలుదేరును. రుక్మిణమ్మగారి సహజమేధస్సుకు తోడు - కుశాగ్ర బుద్ధిగల పతితోడిసాంగత్యము 'పసిడికితావియబ్బి' నట్లయినది. ఆమెలోన నణగిమణగియున్న కవితాప్రవంతి హఠాత్తుగా నొక్కమారు పెల్లుబికి ప్రవహింప సాగినది.

ఆమె పుట్టినింట తొలుత వ్రాసిన - 'కవిత' 'కాత్యాయని' పద్యములు 'గృహలక్ష్మి'ని అలంకరించినవి; 'చందమామ' భారతిలో ప్రకటితమైనది. విశుద్ధ గ్రాంథిక శైలిలో వ్రాసిన ఆమె రచనలకు విశేషముగ స్వాగతమిచ్చినది గృహలక్ష్మి. గృహలక్ష్మితోపాటు ఆమెను చేయూతనీయని పత్రిక లరుదు.

ఈవిధముగా బయలుదేరిన ఆమె కవితాఖండములు 'పూలమాల'గా రూపొంది - 1933 లో ప్రకటితమయింది. ఇది మొట్టమొదట వెలువడిన గ్రంథము. దీని కాంధ్రకవి పండితలోకము హర్ష పులకితమై అపరిమితానందాన్ని ప్రకటించింది. భావకవిత్వం క్రేళ్లురుకుతున్న ఆరోజుల్లో ఈమెలేఖిని సనాతనాధునాతన కలయికగా విశిష్టస్థానాన్ని అలవరించుకుని చిందులు త్రొక్కింది.

పిమ్మటామె - 1937 లో 'దయ్యాలు' (కథలు), 1938 లో 'దేవుడు' (మతం), 1940 లో 'దూతఘటోత్కచము' (నాటిక), 1947 లో 'వత్సరాజు' (నాటిక), 1949 లో 'ప్రార్థన' (మతం), 1950 లో 'కాదంబిని' (కావ్యం), 'దేవీభాగవత మహాపురాణం' (వచనం) ప్రకటించారు.

ఇంకను - 'చారుదత్త' (నాటిక), 'నీలాటిరేవు' (కథలు), 'యుక్తిమాల' (కథలు), 'గోలోకం' (వచనపురాణం), 'సప్తశతి' (పద్యాలు) మున్నగునవి ఎన్నో అముద్రితము లున్నాయి.

వీటిలోని 'దూతఘటోత్కచము' పతికి అంకితమయింది. అందులో వీరు -

"ఏపురాణ యుగమ్ములందే వనాంత కల్పశాఖల నేవిహంగమ జనసుల
యనుగుబిడ్డలమై యనూనాను రాగ మేచికొని పాడుకొనినామొ ఈవునేను!
తెగనివాంఛల నీనాటి తెనుఁగుసీమ కలసికొనినాము మరలస్నిగ్ధంపు టెదల.
విమలమతి! ఈయెడారి జీవితములోన నిన్నుఁబోలు ప్రాణవిభు, సన్నిహితు, మిత్రు!
పడయగల్గితి నెంతటి భాగ్యగరిమ! జలధి వైశాల్య మహహా! నీసదయహృదయ
మేరికిలభించు? ఏడ్చిన నేడ్చినావు; నవ్వినను నవ్వినావు, ఆనంద దుఃఖముల

నాకేరీతిఁ బంచుకోఁదలఁచినావు. భావికాలవినీల గర్భమ్మునందు
ఈ యనంత విశ్వమ్ములు, ఈ విషణ్ణ జీవితమ్ములుకూడ నశించునవియె
అయిననేమి – స్వచ్ఛంద హృదంతరమ్ము లావిశాలావకాశమ్ము లావరించు;
ప్రళయములు నెచ్చెలీ! రాగములకు లేవు. పూవువలె సౌరభార్ద్రమ్ము-ముత్యమట్లు
స్వచ్ఛమును – ధాళధళ్యమ్ము శశివిధాన శీతల మనోజ్ఞమైన నీ స్నేహమతికి
నిండు హృదయమ్ముతోడ, కన్నీటితోడ కాన్కబెట్టుదు నానాటికా ప్రసూన
లేశమిది సానుమతి నెచ్చెలీ! గ్రహింపు.”

అన్నారు. దీనినిబట్టి ఆమె ప్రతిభా వ్యుత్పత్తులూ మున్నగునవి ఎటువంటివో పాఠకు లూహింతురుగాక ! ఆహా! కవియైపుట్టునేగాని, పుట్టి కవికానేర రనుట కింతకంటె తార్కాణ మేమున్నది?

భావకవిత్వం నేడు మానొష్టనే పాడిచిందను వారినిమిత్తము - సంస్కృత ముక్తకాలనూ, ఏకాంకికా నాటికకు మేమే ప్రథమాచార్యులమని గర్వించువారికి భాసనాటికలనూ ఈమె అనువదించారు. అనువాదములు మూలానుసరణములుగాక - సొంతములుగా నుండుట ఈమె కవితలోని విశేషము.

అయిన నీమె కవిత్వమును గురించి వ్రాసిన పలువురు పండితులలో - కవిత్వ తత్వవిచారవేత్తలూ, మైసూరు యూనివర్‌సిటీ ప్రోఛాన్సలరు కీ.శే.డా.సి.ఆర్. రెడ్డిగారి వాక్యములను నిట బొందుపరచుచున్నాను.

“All that I can say is, in my opinion there is no greater Poetess than you in contemporary Telugu literature, and even when compared with the men Poets, your place is amongst the leaders. Your style, so simple and natural, so clear and precise, not involved nor lost in far-fetched metaphors and figures of speech. Allegory of the “Anyapadesa” (అన్యాపదేశ) variety is one of the most attractive features of your poetry. In fact you are the Queen of ‘Anyapadesa’ (అన్యాపదేశ.)

I seem to detect here and there traces of the Mahabharatha language. Please tell me, are you a great reader of the Mahabharatha ?

They are unconscious echoes. They are not deliberate imitations.

My feeling is, these reflections are like those of the “Moon and Stars” seen in the waters of a lake. “They prove that the surface of the lake is perfectly clear and absolutely calm.”

రుక్మిణమ్మగారు - నాడలా సాహిత్యకేదారంలో ప్రవేశించి - స్వయంకృషితో - భర్తృ సహవాసంతో - దానిని పండించి - ఆంధ్రలోకాని కందించి ధన్యులయారు. ధన్యులయిన వీరు - స్థానిక కవితా సమితి కార్యదర్శినిగా చేస్తూవున్న సాహితీప్రచారం అపరిమితం.

సాహిత్యాభి రుచితోపాటు ఆమెకు సాంఘిక రాజకీయాది విషయములం దభినివేశ మత్యధికమైనదే కాని - భాషామతల్లి యకుంఠితసేవ కంకితమైన ఆమె హృదయాన్నది ఆకర్షించలేకపోయింది. అయితే -

వనితాలోకానికీమె చేస్తూవున్న ప్రబోధం సాహితీ గగనకేగాక, సాంఘికౌన్నత్యాన్ని ఇనుమడింప చేస్తూవున్న సంగతి లోకవిదితం.

## స్వ భా వ ము

మృదుమధుర స్వభావముగల ఈమె యోగ్యురాలు; తల్లి దండ్రులకంటె భర్తయే హెచ్చని బాగుగా భావించి - పాతివ్రత్యముచే ఖ్యాతిగాంచిన గుణవంతురాలు. గృహిణీ ధర్మమెరిగి - అదిసరిగా నెరవేర్చుకొనుచు - ఒరులకు ఒజ్జబంతిగా తనరుచున్న ధీర. పండితు లధ్యక్షులుగాగల సభలలో సభ్యులు మెచ్చుకొనునట్లుపన్యసింపగల ఉపన్యాసకురాలు. ఏపనినైన చేసి చెప్పుట ఆమె యభిమతము. బుద్ధికితట్టిన సత్యమును నిర్మొగమాటముగ చెప్పుటకామె వెనుకాడదు. ఆచరణ యోగ్యముగాని మాటలన్నను, ఉపన్యాసములన్నను ఆమెకు కిట్టదు. రాచకార్యములపట్ల ఆమెఇచ్చు సలహా అమోఘమైనది. సమర్థులయిన మహిళలకు గృహకార్య నిర్వహణమునందే గాక రాచకార్యములందుకూడ ప్రవేశమిచ్చుట న్యాయమని ఆమె అభిప్రాయము. స్త్రీలసలు ఇంటిపనులలోని మెలకువలు తెలిసికొని యుండిననేకాని దేశమునకు ముక్తిలేదని ఆమె యుద్బోధ. ఇంతేల - ఆమెగొప్ప సంస్కర్త్రి.

## ది న చ ర్య

రుక్మిణమ్మగారి దినచర్య నియమబద్ధమైనదీ, ఆదర్శప్రాయమైనదీని. ఈమె వేకువనే నిద్రనుండిలేచి - గ్రంథరచనచేయడం, అయిదుగంటలు కాగానే సముద్రతీరంలో రెండుమైళ్లు నడచిరావటం - స్నానాది కృత్యాలు నిర్వర్తించుకుని ఇలవేల్పును పూజించటం చేస్తారు.

ఏడు గంటలనుండి ఎన్మిది గంటలదాకా - ఆంధ్రనామ సంగ్రహమూ, అమరమూ మొదలయిన గ్రంథాలను బాలికలకు పాఠంచెబుతారు. తర్వాత గృహకృత్యాలలో ప్రవేశించి పదకొండు గంటలకు భోజన భాజన కార్యకలాపాలు ముగించటం, మధ్యాహ్నం రెండు గంటలనుండి కవితా గోష్ఠి - పత్రికా పఠనాదులూ సాగిస్తారు.

సాయంత్రం ప్రార్థనానంతరం భోజనంకాగానే రెండుగంటలు కావ్యములు చదివి పరుంటారు.

## కు టుం బ ము

ఈమెకు - ఒకకుమార్తె - ఇద్దరు కుమారులూను. వీరిది - సామాన్యకుటుంబము; ఈసంగతి వీరొక పద్యంలో ఇలా వ్రాసుకున్నారు -

"లేవుగురాలు, ఏన్గులును లేవు, సవారియు లే దలంక్రియల్<br>
లేవు భటుండు లేడొకఁడు లేదు......................; మా<br>
కీ విపులావనిన్ గల సుధీంద్రుల సంతస మందఁజేసి మూ<br>
ర్ధావన తమ్మొనర్చు కవితామృత తత్త్వము మాత్ర మొప్పెడున్."

సరిపల్లి నరసింహామూర్తి.






## దోసవరుగు

దోసకాయలు తీసుకుని అడ్డంగా సన్నగా ముక్కలుకోసి ఎండలో ఎండబెట్టాలి. అవి దాదాపు 8 రోజు లెండాలి. ఎండిన తరువాత తీసుకొని ఒక డబ్బాలో పోసి వుంచుకోవాలి. కావలసినపుడు ముందుగా బాణలి పొయ్యిమీదపెట్టి దానిలో కొద్దిగా నూనె వేసి కొద్దికొద్దిగా ముక్కలు వేసుకుని వేయించవలయును. బాగుగా వేగిన తరువాత బయటకుతీసి దానిమీద కొద్దిగా కారంజల్లి వాటిని భోజనంలో వేసుకుని తినవచ్చును.

## వంగవరుగు

దీనినికూడ తయారు చేయుటకు ముదిరిన వంకాయలు ముక్కలుగాకోసి ఎండబెట్టాలి. బాగుగా ఎండిన తరువాత ఒక బాణలి పొయ్యిమీదపెట్టి నూనె కొద్దిగావేసి వేయించవలయును. వాటిమీదకూడ కొద్దిగా కారంజల్లి భోజనములో పెట్టుకొని తినవచ్చును.

బొడ్డుపాటి మహాలక్ష్మమ్మ.

## బీన్సు భాత్

10 పలములు చిక్కుడు గింజలు నీటిలో వుడికించి వార్చవలెను. ఒక గిన్నెలో 4 తు. నెయ్యివేసి పొయ్యిమీదపెట్టి 1 తు. ఆవాలు ½ తు. మినప్పప్పు, 1 తు. శనగపప్పు, 1 ఫ. జీడిపప్పు, కర్వేపాకు 4 పచ్చి మిరపకాయలు సన్నగాతరిగి, 2 తు. నీరుల్లిముక్కలు, అల్లంముక్కలు అన్ని సమంగావేయించి 1 అళాకు గోధుమరవ్వవేసి 5 నిమిషములు వేయించి 1 అళాకు నీరుపోసి వుడికిన తరువాత చిక్కుడుగింజలువేసి 1 అళాకు నెయ్యిపోసి బాగా కలియపెట్టి 10 నిమిషములుంచి దింపవలెను.

## కరకరవడ

1 అళాకు మినప్పప్పు, 1 అళాకు శనగపప్పు, 1 అళాకు పెసరపప్పు 4 గంటలు నీటిలో నానపెట్టి తీసి బుట్టలో వెయ్యవలెను. నీరుపోయిన తరువాత పంపునీరుల్లిపాయలు, 10 పచ్చిమిరపకాయలు, అర తులం వుప్పువేసి నీళ్లుపొయ్యకుండా పప్పు ఎక్కువ నలగకుండా రుబ్బవలెను. 1 తవ్వనూని పొయ్యిమీద బాణలిలోవేసి మరగపెట్టి కొంచం పిండితీసి ఆకుమీద బిళ్లలుతట్టి నూనిలోవేసి ఎర్రగా వేయించవలెను.

## స్వీట్ క్వీన్

1 పడి పంచదార లేతపాకంపట్టి, 3 అళాకుల శనగపిండివేసి 15 నిమిషములు కలపవలెను. 4 ఫ. జీడిపప్పు 1 ఫ. కిస్‌మిస్ నేతిలోవేయించి వెయ్యవలెను. 1 కాయ కొబ్బరికోరు నేతిలోవేయించి వెయ్యవలెను. ½ తు. ఏలకపొడి, 2 అళాకుల నెయ్యివేసి బాగా గరిటతోకలిపి 10 నిమిషముల తరువాత దింపి వేరేపెట్టవలెను.

చావలి అన్నపూర్ణాబాయి.

—(౦)—

# నేటి యువకుని భావనలో స్త్రీమూర్తి

"శ్రీమతి"

(గతసంచిక తరువాయి)

విద్యార్థినుల పట్ల కొందరి గృహిణీ మణుల ఆరోపణ యేమంటే, విద్యావతు లైన యువతులు సాధారణముగా డాబు, దర్పములతోకూడి, సామాన్య కుటుంబము లకు చెందిన వారితో మాటాడరని, వీరి కున్న కలుపుగోలుతనము వారికుండదని - నిజమే. కొందరి విద్యావతుల ప్రవర్తన అట్లే యుండును కాని, వారు నివసించు పరిసర ప్రాంతములందలి కుటుంబముల ప్రవ ర్తనపై అది ఆధారపడియుండును. మధ్య తరగతి కుటుంబములకు చెందిన విద్యార్థి నులు సహజముగా సామాన్య కుటుంబ ములమధ్య నివసింతురు. మధ్యతరగతి వారు, అటు విశాలభావములను పూర్తిగ కలిగియుండరు. ఇటు పూర్తిగ వెనుకబడిన జాతుల నీచభావములను కలిగియుండరు. అందుచే అట్టి విద్యార్థిని కళాశాలలో ప్రవ ర్తించినట్లు ఇంటివద్ద ప్రవర్తించిన, ఆమెను మాటలతో చెండాడెదరు. ఈ కారణము వలన ఆమె జాగ్రత్తగనే ప్రవర్తించును; లేదా, వారితో హృదయ పూర్వకముగా మాటాడి, కలియజాలదు. మరియు, ఆమెకు సాధారణముగా, పనివాండ్రు, చాకలి మున్నగు వారితో అవసరముండును. అట్టి పరిస్థితులలో వారు ఆమెనుగూర్చి యితరు లతో చెప్పు మాటలపై ఆమెపై ఇతరులకు వచ్చు గౌరవభావములు కొంతవరకు ఆధార పడియుండును.

ఇంక ధనవంతులైన విద్యార్థినుల విష యము. వారి కనుకూలమైన పరిసరముల లోనే వారు నివసించెదరు. కనుక వారి కిట్టి చీకాకులుండవు. కాని, వారిలోకూడ స్త్రీ విద్యాదూషకులైన యువకులు లేక పోలేరు. అట్టి విద్యార్థిని పాలిటికి, ఇట్టి యువకులే ఆమెపై లేనిపోని ప్రచారము లను చేయుచుందురు. అందుచే ఏవిధముగ చూచినను, ఇట్టి హీనతకు, సంఘమున, ప్రతి స్త్రీయు నేదో ఒక విధమున గురి యగుచున్నది.

స్త్రీ విద్యాభివృద్ధిని, వారి గౌరవ మర్యాదలను పెంపొందింపజేయు నిమిత్తము అవలంబింపవలసిన మార్గములను సభల లోను, కళాశాలలోను బల్లగుద్ది ఉపన్యాస ములిచ్చి, అట్టహాసముచేయు మహాశయులే, తమవరకు, తమ కుమార్తెల విద్యాభివృద్ధి వరకు వచ్చుసరికి వెనుకంజవేసి, ఎన్ని యిక్కట్లు పడవలసి వచ్చినను, వరునకు మొదటిభార్య యుండిననుసరే, ఆమెకు

వివాహముచేయుట, సంఘమునకు భయ
పడియేకదా! అట్టి యువకులు తమ
వివాహసమయ మాసన్నమగుసరికి, బేలల
వలె ధైర్యమునీడి, విద్యావతియైన యువ
తిని పెండ్లాడుటకు భయపడియేకదా, ఏవల్లె
పడుచునో, అమాయకపు బాల్యదశలో
నున్న ఆమెనో పెండ్లాడి, తమ ఆధిక్య
తను నిరాటంకముగ ఆమెపై సాగించు
చున్నారు.

మరికొందరి నేరారోపణ యేమంటే "ఈ
చదువుకున్న చవటమ్మలే వెనుకముందు
లాలోచింపక ఒక భార్యగల పురుషుని
చేబట్టిన దద్దమ్మ"లని - నిజమే! స్త్రీ సహ
జముగా చంచల చిత్తయని పెద్దలే నిర్ణ
యించిరి. కాని ఆమె తన శీలమునకు కళం
కము తెచ్చు పనులను చేయుటకు సాహ
సింపజాలదు. అట్టి వివాహములకు, ఈ
చదువుకున్న చవటమ్మలు నేర్చుకున్న
విద్యకు సంబంధమేలేదు. ఆ పురుషున కామె
పైగల ప్రేమను తెలుసుకొనిన పిమ్మటనే
ఎట్టి స్త్రీయైనను, ఆ వివాహమున కంగీక
రించును. అది ఒక విధముగ దోషమే
కాని, తనను అగ్నిసాక్షిగా వివాహ
మాడిన భార్యను, తననే దైవమని నమ్మి
యున్న గృహిణిని తిరస్కరించి యింకొక
స్త్రీని చేపట్టదలచిన ఆ పురుషుని జ్ఞాన
మేమైనది? చదువుకున్న యువతులనే
నిందించుటలో అర్థములేదేమో! విద్యా
విహీనులైన ప్రజానీకములో ఇట్టి వివాహ
ములను మనము ఎన్ని చూచుటలేదు!
ఎక్కడనో ఒక భార్యగల పురుషుడు భర్తను
వదలిన ధనికురాలైన యువతిని విద్యా
విహీనను పెండ్లియాడెనని మనమెన్నడును
వినలేదా? అందువలన చదువును నిందిం
చుటలో అర్థములేదు. అసలు అతడు
వివాహమాడుట ఆమె ధనముకొరకు,
లేనిచో భర్తచే పరిత్యజింపబడిన ఆమెను
అతడెన్నడైనను నమ్మునా? సాధారణ
ముగా యువకుడు స్వార్థపరచిత్తముతో
ఏకార్యమైనను చేయుచుండును. అంటే,
స్త్రీ జీవితములో ఆతనికొక యున్నతస్థాన
మున్నంతవరకు. అట్టి పరిస్థితులలో ఆతడు
మరల ఈ విద్యావతిని వివాహమాడి, ఆమె
కీయగల నిష్కళంకమైన ప్రేమయేదీ? అట్టి
ప్రేమ అతని మొదటి భార్యకే దక్కుట
సహజము. అట్టి వివాహము (రెండవది)
అభివృద్ధికారి ఎట్లుకాగలదు? ఆ మరుసటి
దినమునుండియే వారిమధ్య తగవులు ప్రారం
భమై వివాహ విచ్ఛిన్నదశ ప్రారంభ
మగును. అభిమానవతియైన అట్టి విద్యా
వతికి, పురుషుని స్వార్థబుద్ధిని గ్రహించిన
అట్టి గృహిణికి, తనపై తనకే రోతకలుగు
టలో వింతయేమి? ఓర్పులేని అట్టి యువతి
అతనితో తనకుగల సంబంధమును త్రెంచు
కొని స్వతంత్రజీవినియై, ఏకాకినియై ప్రపం
చము నెదుర్కొన సాహసించును. లేదా,
అతని ప్రేమకొరకు ప్రాకులాడి, సామాన్య
గృహిణియగుచున్నది. అంతే ఆమె జీవిత

రథము. అతడి కిష్టమున్న పోషించును. లేకున్న ఆమెయే తన బిడ్డలకొఱకు తన కొఱకు ఏదో ఒక వృత్తి నవలంబింపవలసి వచ్చుచున్నది. ఏ తరగతికి చెందిన యువతియైనను ఇంతే! భారతదేశపు సాంప్రదాయానుసారము వివాహితయైన యువతి భర్తను తిరస్కరించుట చాల అరుదు. ఎన్ని యిడుములబడినను ఆమె తన భర్తను విడనాడి జీవింపజాలదు. జీవించినను, అట్టి జీవితము దుఃఖభాజనమే!

అసలు నేటి మానవుని జీవితమే మూన్నాళ్ళ ముచ్చటగా అనిత్యమై యున్నది. అట్టిచో, ఈ వివాహములు, తగవులాటలు, ఉద్యోగములు, వస్తువాహనములు నిత్యములా! ఎవరికి ఏది మంచిదనితోచిన అది చేయుటయే వారి లక్ష్యమై యున్నది. నీతి నియమములను పాటించి దైవభీతికలిగి మెలగువారేరీ? అట్టివారున్నను వారికి సవ్యమైన బ్రతుకుతెరవే కాన్పించుటలేదు. శాంతి లోకమున ఎట్లు నెలకొల్పబడును? మానవుని హృదయమందు అట్టి శాంతము, ధర్మప్రవర్తన, త్యాగబుద్ధిలేనిది దేశమున శాంతమే శూన్యము. ముందునకేమి జరుగనున్నదో ఎవరికెఱుక? ఏమిజరుగనున్నను శుభమును వాంఛించుటయే మానవుని లక్షణము కనుక మనముకూడ శుభదినములను, దేశకల్యాణమును కాంక్షింతము.

———(o)———

ఆటిగలతో ఉదకమ్ము తెచ్చేటివేళ
చిక్కడాయి పువ్వుల్లు పూచేటివేళ
చిప్పల్లగందమ్ము తీసేటివేళ
ఆవులు గోవులు వచ్చేటివేళ
అంబోతు రంకెలు వేసేటివేళ
సంధింటి దీపమ్ము పెట్టేటివేళ
చాకింటిమడతలు తెచ్చేటివేళ
అన్నల్లు అందలా లెక్కేటివేళ
తమ్ముళ్లు తాంబూలం వేసేటివేళ
మరుదుల్లు మరిజాదపాడేటివేళ
కూతుళ్లు గుండిగలు దింపేటివేళ
కోడళ్లు కోటుపసుపు కొట్టేటివేళ
చెల్లెళ్లు చేమంతులు ముడిచేటివేళ
వదినెల్లు వంటల్లు వండేటివేళ

మనపూర్వులు అంటే తెలుగువారు క్రీస్తుశకానికి పూర్వం అనేక పాటలను, కథలను సృష్టించారని మనం ఊహించవచ్చు. ఇప్పుడు మనం పాడేపాటలలో అప్పటి పాటలు కొన్ని కొన్ని మార్పులు చెందుతూ నిలచి ఉన్నాయని తలచవచ్చు. ఈపాటలు ఎల్లకాలం ఒకటే రూపంలో ఉన్నాయని అనుకోవద్దు. ఎందుచేతంటే ఇవి ఎక్కడా తాటాకులమీద కాని, కాగితాలమీదగాని రాసిపెట్టినవి కావు. పెద్దవాళ్లు, చిన్నవాళ్లకి నేర్పుతూ వచ్చారు. ఇప్పటికీ మీరు వేదాలు పెద్దవాళ్లు పిల్లలకి నేర్పుతూండడం చూస్తూనే ఉన్నారు. అలాగే ఈపాటలనుకూడ ఒకతరం వారు మరొకతరం వారికి నేర్పుతూ వచ్చారు. అలాగు ఆనోట ఆనోట వస్తూన్న పాటలు కాబట్టి ఒకరిదగ్గిరనుంచి ఒకరునేర్చుకొంటూన్నప్పుడు వారు మంచివి అనుకొనే చిన్న చిన్న మార్పులను చేస్తూండవచ్చు.

అయితే ఈపాటలను రాసిన వారెవరు? పెద్ద పాటలను ఎవరో ఒకరు రాసిన మాట నిజమే. కాని ఈపాటలలో ఏకొన్నిటికో తప్ప సర్వసాధారణంగా ఎవరు రాసిందీ తెలియదు. చిన్నపాటలను గురించి ఈ సంగతి మరీ నిజం. ఈగేయాలన్నిటినీ మగవారే రాశారని తలవవద్దు. ఆడవారు వ్రాసినవి కూడ ఉన్నాయి. లాలిపాటలలోను, జోలపాటలలోను ఉండే సున్నితమైన భావాలు పిల్లలను లాలించే తల్లులకు తప్ప మరొకరికి అందవు. కాబట్టి వాటిని స్త్రీలే రాసి ఉండాలి. రకరకాల స్త్రీల పాటలను స్త్రీలే రాసి ఉంటారని మనం అనుకోవచ్చు.

ఇప్పుడు మరొక అంశాన్ని చూద్దాం. ఈ పాటలను ఎప్పుడు రాశారో చెప్పగలమా? అంటే, వీటిని ఏకాలంలో రాసిందీ నిర్ణయం చెయ్యగలమా అని. ఈ పాటలలో ఉండే చారిత్రకాంశాలనుబట్టి అవి ఏకాలంలో రాసిందీ చెప్పవచ్చు. ఇటువంటి అంశాలు బొబ్బిలి పాటలో ఉన్నాయి. ఆరుమరాటీల కథలో కూడ కనబడతాయి. కాని మిగిలిన అనేక పెద్దపాటలను గురించి వాటిని రాసిన కాలం సరిగా నిర్ణయించడం కష్టం. చిన్న పాటలను గురించి అసలే చెప్పలేము. ప్రపంచక వాఙ్మయం పరిశీలించిచూస్తే ఇటువంటి పాటలు వందలకొద్దీ ఉన్నాయనీ, వీటిలో

కొన్ని కొన్ని క్రీస్తుశకానికి పూర్వంనుంచి కూడ వస్తున్నాయనీ అనుకోవచ్చు.

గుడు గుడు గుంచం గుండారాగం
పాములపట్టం పడగారాగం

అనే పాటభాగమున్నా,

చమ్మచెక్క చారడేసిమొగ్గ
అట్లుపొయ్యంగ ఆరగించంగ

అనే పాట భాగమున్నా క్రీస్తుశక ప్రారంభంలో తమిళ భాషలో రచింపబడ్డ తోల్కాప్పియం అనే గ్రంధంలో చెప్పబడిన లక్షణంతో సరిపోతున్నాయని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు 'దక్షిణ దేశభాషా సారస్వతములు - దేశి' అనే తమ గ్రంధంలో తెలియజేశారు. దీనిని బట్టి ఇవి క్రీస్తుశకం ముందునుంచీకూడ ఉన్నాయని మనం ఊహించవచ్చు.

ఇప్పటికి సుమారు ఏడువందల ఏళ్ల కిందట ఉండిన ఒక గొప్ప తెలుగుకవి - పాల్కురికి సోమనాధుడు అనే పేరుగలాయన - తన కాలంలో ఉండిన రకరకాల పదాలను తెలియజేశాడు. అవేమిటంటే తుమ్మెద పదములు, ప్రభాతపదములు, పర్వతపదములు, ఆనందపదములు, శంకర పదములు, నివాళిపదములు, గొబ్బిపదములు, వెన్నెల పదములు, వాలేశు పదములు మొదలైనవి.

కొందరి ఊహ ఏమిటంటే వెనకటి కాలంలో తెలుగు భాషలో అన్నీ పెద్ద పెద్ద కావ్యాలేగాని ఇంగ్లీషులో ఉన్నట్లుగా ఖండకావ్యాలు (Short Poems) లేవని. కాని ఈ అభిప్రాయం సరియైనది కాదు. జానపదగేయాలలో వందలకొద్దీ ఖండకావ్యాలున్నాయి. మచ్చుకి ఈ ఖండ కావ్యం చూడండి. దీనిలో కవి బూరుగు చెట్టు అందాన్ని వర్ణించి, బాలెంతయొక్క చక్కదనాన్ని తెలుపుతున్నాడు.

వేసవికాలాన పూసుబూరుగలు
ఆసపడి చిలకలు ఆరునెలలుండు
పూవుపూసిందాక పూగొమ్మనుండు
కాయకాసిందాక కడగొమ్మనుండు
పండు పండిందాక పలవలోనుండు
దూదిచూచు చిలకలు దుఃఖపడ్డాయి
పసుపురాసి బాలెంత పైటనిల్చుంటె
పండని చిలకలు పైనవాలేయి
కాయని చిలకలు కారాడినాయి
పండుకాదు చిలకలలార! పచ్చిబాలెంత
కాయగాదు చిలకలార! కామునితల్లి.

జానపద గేయాలలో అవి వ్రాసిన కాలంనాటి నిత్యజీవితం ప్రతిబింబిస్తూంటుంది. లక్ష్మమ్మకథ, కామమ్మ కథలలో ఆనాటి సాంఘికాచారములును, బొబ్బిలి కథ, దేశింగురాజుకథ, ఆరుమరాఠీల కథలలో ఆనాటి రాజకీయ పరిస్థితులును కనబడతాయి. జోలపాటలు అనే చిన్నరకం పాటలలో దైనందిన సంసారంలోని అన్ని రకాల అందచందాలు వర్ణించబడ్డాయి. వీటినిచూస్తే పిల్లలతోకూడిన ఇంటికంటె హాయిలేదనిపిస్తుంది. ఈఅంశానికి మచ్చుగా

ఈ క్రింది పాటలు చూడండి. ఇప్పుడు పాడేపాటలో చిన్నబిడ్డకి గాజులు వేయించడం ఎంత వేడుకో కనబడుతుంది.

చిన్నారి పొన్నారి గాజుల్లసెట్టి
తేవె మాఅమ్మాయికి తేనెగాజుల్లు
గుడితిరిగి వచ్చేయి గుడ్లగాజుల్లు
గుత్తాన మాచిన్న అమ్మ చేతుల్ల
పట్నం తిరిగివచ్చేయి పచ్చగాజుల్లు
పచ్చని మాచిన్న అమ్మి చేతుల్ల
ఊరు తిరిగివచ్చేయి ఉత్తగాజులు
గుత్తాన మాచిన్న అమ్మి చేతుల్ల.

మరొకపాట వినండి. బిడ్డడంటే తల్లికి ఎంత ప్రేమో చూడండి.

వీధినెందరుఉన్న విసరదేగాలి
రచ్చనెందరుఉన్న రాదమ్మ వాన
నాచిన్న అబ్బాయి వీధినిలుచుంటె
మొగలిపువ్వులగాలి, ముత్యాలవాన!

మరొకపాట చదువుతాను. ఆడుకొనే బంతికి సంబంధించిన పాట ఇది. ఈ పాట రాసిన కాలంలో దీనిలో చెప్పిన ఆరు సంస్థానాలు విడివిడిగా రాజులచే పరిపాలింపబడుతున్నాయని తలపవచ్చు. అప్పటికి ఇంకా విశాఖజిల్లాలోని విజయనగర సంస్థానం ఏర్పడలేదు.

విశాఖపట్నాన వీధిగుమ్మాన
వింతరాచకొడుకు బంతులాడేడు
బంతివెళ్లి పాలకొండ సభలోనపడితే
ఇది ఎవరిబంతని వివరించెరాజు
గోలకొండవారి గొలుసుల్లబంతి
పాలకొండవారి పచ్చల్లబంతి
శ్రీ కాకుళమువారి చిత్రాలబంతి
నెల్లూరువారిదే నీలాలబంతి
బొబ్బిల్లివారిదే బంగారుబంతి.

మీరు సాధారణంగా పద్యాలలో చూసే పెద్దకఠినమైన మాటలు, కష్టమైన భావం, పెద్దలక్షణ నియమాలూ వీటిలో కనబడవు. కవి తన హృదయంలోంచి సూటిగావచ్చిన భావాలను మనస్సులోంచి నేరుగావచ్చిన మాటలతో చెప్తాడు. అటువంటప్పుడు మాటలు, భావాలు మనకి తెలియక పోవడానికి అవకాశంలేదు. అందుచేత బొబ్బిలి పాటను పాడుతూంటే చిన్నలు, పెద్దలుచుట్టూచేరి మైమరిచి వింటారు. చిన్నపిల్లలు ఆటలతోపాటు, పాటలు పాడుకొంటూ ఒళ్లు ఎరగకుండా గంతులు వేస్తారు.

జానపద గేయాలలో రకరకాల లక్షణాలున్నాయి. ఇక్కడ కొన్నిటికి ఉదహరిస్తాను.

కొంగ కొంగ గోళ్లు
రంగడిచేతిరాళ్లు
నాచేతిపూలు

ఇంకొక వరసఉన్నపాట ఇప్పుడుపాడే ఏనుగపాట.

ఏనుగమ్మా ఏనుగు
ఏఊరు వెళ్లిందేనుగు
ఉప్పాకెళ్లిందేనుగు
ఉప్పునీళ్లు తాగిందేనుగు
మాఊరు వచ్చిందేనుగు
మంచినీళ్లు తాగిందేనుగు.

ఇంకోవరసపాట ఇప్పుడు పాడతాను. ఇది పసిపిల్లలుచేసే విద్దాలను గురించి:

విద్దాం విద్దాం వరపరల విద్దాం
విద్దాంచేస్తే గిద్దెడు నెయ్యి
తప్పకచేస్తే తవ్వెడు నెయ్యి
మళ్లీచేస్తే మానెడు నెయ్యి

మరొక వరసపాట చూడండి.

చల్లచెయ్యి గొల్లభామ-నీ
సందిటి దండలు కదిలేను
వెన్నచెయ్యి అమ్మాయి-నీ
వెండి మురుగులు కదిలేను
పాలుతాగు అబ్బాయి-నీ
పమిడి మురుగులు కదిలేను.

ఇంకొక వేళాకోళంపాట చూడండి.

చెప్పుకో! చెప్పుకో!
చెవులెక్క తీసుకో!
మామిడాకిస్తాను
మండేట్టుకో!

అనేక గేయాలు సాధారణంగా మంజరిగా ఉంటాయి. మంజరి అంటే ప్రాసలేని ద్విపద. వీటిలో సర్వసాధారణంగా యతి నియమం తప్పదు. కాని అసహజంగా కనబడేమాటుంటే ఆ యతినియమంకూడ కనబడదు. కవి అంత స్వతంత్రుడు. ఇంత సులభంగా ఉండే గేయాలు వందలకొద్దీ ఉన్నాయి.

జానపదగేయాలు ఎంతో రమ్యంగా ఉండబట్టే జనులకందరికీ ప్రీతికరమయేయి. వీటిజనప్రియత్వం ఎరిగి పురాతన కాలంనుంచి అనేకమంది రచయితలు వీటిలాగే రాయడానికి ప్రయత్నించారు. తెనుగులో ఉండే ద్విపదకావ్యాలు అటువంటివే! రంగనాథ రామాయణ కావ్యాన్ని, పల్నాటి వీరుల కథని ఇప్పటికీ కొన్ని ప్రాంతాలలో పాటలుగా పాడుతూంటారు.

ఈ కాలంలో అనేకమంది కవులు గేయాలను రాస్తున్నారు. గురుజాడ అప్పారావు గారు'ముత్యాలసరము'ని ఒకరకం లక్షణానికి పేరుపెట్టి కొన్ని గేయాలు రాశారు. కవికొండల వెంకటరావుగారు కావలసినన్ని గేయాలను రాశారు. ఇంకా అనేకమంది నవకవులు ఎన్నో గేయాలను రాశారు.

చిన్నపిల్లలకోసం చింతాదీక్షితులుగారు లక్కపిడతలను, నేను పాలపిట్ట, మిణుగురు పురుగు అనే గేయ కావ్యాలను ప్రకటించాము. ఇవన్నీకూడ ప్రజల నోళ్లలో చిరకాలముంటే, ఇవికూడ జానపద గేయాలే అవుతాయి.

# చర్మ బాధలన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనియై త్వరితంగ్గా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిన్ని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.



బిడ్డల ఆరోగ్యమునకు

ప్రసిద్ధిచెందినది:

# రమణీస్

# బేబిగ్రైప్






తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్,
బరంపురము (గంజాం), బొంబాయి.

# శనిగాని - ముచ్చట్లు



మిసెస్. అంజి

రామాయణం నిజమే అన్నమాట అని అప్రయత్నంగా వస్తుంది - రామేశ్వరంలోని రాముడు కట్టిన వారధి చూచినవారినోటినుంచి. అసలు ఈ వంతెన నిర్మించిన రామచంద్రమూర్తి తన భార్య నపహరించిన రావణుని సంహారం చేశాడట. యుద్ధంచేసి - యుద్ధానికి పూర్వం రావణుడు దర్బారులో నున్నాడట- ఒకరోజున నారదమహర్షి దిగాడు-రావణుని లంకను. దర్బారులో ప్రవేశించాడు-దేవముని. సింహాసనం మీద రావణుడు కొలువుతీరివున్నాడు. నారదుని పైకిరమ్మని అతడు పిలిచినాడు. ఆ సింహాసనంక్రింద పెద్దవి తొమ్మిదిమెట్లు నిర్మింపబడి వున్నాయ్. ఒక్కొక్క మెట్టుమీద ఒక్కొక్క గ్రహం చొప్పున సూర్యాదిగా నవగ్రహాలు బోర్లవేసి బంధింపబడి వున్నాయ్. ఈ సంగతి నారదునికేం తెలుసు? పైచూపు బాపు. "నారాయణ" అంటూ ఏదో పాడుకుంటూ ఆకాశంవైపు చూస్తూ మెట్లు ఎక్కసాగాడు అతను, ఈ ఛాన్సుపోతే మరల తటస్థించదనుకోని. "శని" తన మెట్టుమీద కాలుపెట్టిన నారదుణ్ణి అమాంతంగా లాగడు కాలిబొటనవ్రేలు పట్టుకోని. దేవమహర్షి జర్రునజారి ఆ మెట్టుపైనే పడ్డాడు. సభికులు గందర్గోళంగా చప్పట్లుచరుస్తూ రావణునితోసహా అందరు పకపకా విరగబడి నవ్వసాగారు. బోర్లపడ్డ నారదుడికి వీండ్లు నవ్వింది వినిపించలా. తానేంటో! తన దెబ్బేంటో-తప్ప! నారదుడికి మరేం తోచలా "శనిగా! నీవుండేనా! నవగ్రహాలను త్రొక్కుతున్నావ్" అంటాడు మెల్లిగా లేస్తూ.

"నారదా! తరువాత నాతడాఖా చూపిస్తా! ఒక్కసారి బోర్లవేయించవోయి!" అన్నాడు.

'అదెంతోయ్.శనిగా-నాకూ" అంటూ, మెల్లిగా బట్టలు సర్దుకోని క్రిందపడిన వీణను తీసుకోని నారదుడు క్రింద చూచుకొంటూ పైకెక్కి వెళ్లాడు. రావణుడు తన సమీపంలోని ఓ చిన్న పీఠంపైన కూర్చోమన్నాడు. నారదుడు కూర్చుని ఇలా అన్నాడు. "ప్రపంచంలో నీకీర్తి వెలిసిపోయింది రావణా! నవగ్రహాల్నే మెట్లకు బంధించి వేశావని."

రావణుడు - "అదెంతలే.నాకు" అంటాడు సగర్వంగా! నారదుడు "అయితే" ... ... అనబోతూవుంటే రావణుడు చెప్పు త్వరగా అంటూ మాట మధ్యలో అందుకొంటాడు. "శనిగాడికి జడిసి రావణుడు శనిగ్రహాన్ని బోరగిలివేసి పరుండబెట్టాడు - అన్న అపఖ్యాతి నాచెవులను సోకంగానే ఈ నారదుడు భరింపలేక రాక్షసేశ్వరునికి నివేదిస్తామంటూవచ్చా" నంటాడు.

రావణునికి కండ్లు ఎర్రనైపోతూవుంటే వెర్రికేకలేస్తూ భటులను పిలిపించి శనిగ్రహాన్ని బోరగిలనుంచి వెల్లికిల త్రిప్పించి నారదుడి ఎదుటనే శనిగాని గుండెలమీద పాదాలతో తొక్కుతూ, మీసాలు మెలేసుకొంటూ, శనిగాన్ని క్రూరంగా చూస్తూ, సింహాసనంపైకి మరల ఎక్కివచ్చి కూర్చొంటాడు - అతను, ఆ తర్వాత నారదుడు వెళ్లిపోతాడు.

రావణుడు ప్రతినిత్యం శనిగాన్ని ఇలాగే త్రొక్కుతూ, వెక్కిరించుతూ, వికటంగా కోపదృష్టులతోచూస్తూ సింహాసనం అధిరోహిస్తూ వుంటాడు. మూడువారాలు ఇలాగే చేశాడు - రాక్షసేశ్వరుడు. ఇంతలో (21 రోజుల్లో) లంకకు వంతెనకట్టడం రాముడు పూర్తిచేసాడట. లంక ప్రవేశించిన రామునిచే రావణుని సపరివార కుటుంబంసహా శనిదృష్టి పారడంవల్ల నాశనం అయినట్లు - ముచ్చట్లు వాడుకలోకంలో వ్యాపించి వున్నాయ్.

(సశేషం)

రాబోవు జెమినీ చిత్రము




—అయితే, ముగ్గురి జీవితాలు, ప్రవర్తనలు
మూడు విధాలు.

—మాతృప్రేమయొక్క మధుర తంతులను
స్పందింపజేస్తున్నవి.

త్వరలో వచ్చుచున్నది

(134.వ పేజి తరువాయి)

సభకు అధ్యక్షత వహించుచున్న శ్రీమతి వావిలికొలను పద్మాసనమ్మగారికిని, సభకరుదెంచు సోదరీ సోదరులకును నాప్రణామములు.

మీరు తలపెట్టిన మహోద్యమము శాశ్వతమై వెలయుగావుత. ఇంకను అనేక రీతుల ఆంధ్రదేశమున కమూల్యమగు సేవ యొనర్చుటకై పరమేశ్వరుడు మీకు ఆయురారోగ్య ఐశ్వర్యముల నొసంగి బ్రోచెడినిగాక.

అడుసుమల్లి శ్రీనివాసరావు, వేటపాలెం.

♦ ♦ ♦ ♦ ♦ ♦

I am so thankful to you for your kind invitation for the KANKANAM. I wish the function all success. May GRIHALAKSHMI continue to spread the light of Knowledge in every Andhra home and ever be the loving companion of every woman.

With best regards,

K. K. MENON, Palghat.

♦ ♦ ♦ ♦ ♦ ♦

Dear Sri KESARI,

We are in receipt of the invitation for the GRIHALAKSHMI Jayanti Celebrations on Sunday the 2nd March 1952. Thanks very much.

May Sri. Bhagavan bless the function with all success.

With the blessings of Sri. Bhagavan - Prasad enclosed.

Yours sincerely
RAMANASRAMAM
Tiruvannamalai.

# గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవము



2.3.52 ఆదివారమునాడు చెన్నపురి రాయపేటయందలి కేసరికుటీరం భవనమునందు వార్షికముగా జరుగుచుండు 'గృహలక్ష్మి జయంతి' సందర్భమున స్వర్ణకంకణ ప్రదానోత్సవము శ్రీమతి వావిలికొలను పద్మాసనమ్మగారి అధ్యక్షతన అత్యంత వైభవముగా జరిగెను. కంకణ గృహీత శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు. కంకణ మహోత్సవములో పాల్గొనిన పురప్రముఖులలో కొందరు, శ్రీ మాగంటి బాపినీడు, ఓరుమల్ల కామేశ్వరరావు, డా. వి. నారాయణస్వామి, డా. తిరుమూర్తి, జనమంచి రామకృష్ణ, దివాన్ బహదూరు బండి శ్రీ హరిరావునాయుడు, డి. జి. శర్మ, వాడ్రేవు కామరాజు, మైదవోలు శేషాచలపతి, వావిలికొలను వెంకటరమణారావు, న్యాపతి రాఘవరావు, పిలకా గణపతిశాస్త్రి, జయంతి బ్రహ్మానంద పందిరి మల్లిఖార్జునరావుగారలు, శ్రీమతులు కస్తూరి రుక్మిణమ్మ, సర్వేపల్లి ఇందిరాదేవి, కామరాజు మైత్రేయి, గిడుగు లక్ష్మీకాంతమ్మ, వావిలికొలను లీల, కె. చంద్రమతి, జనమంచి సుగుణ, పందిరి మల్లిఖార్జునరావు గారి సతీమణి, దామెర్ల జోగులాంబ, ఐ. రాజ్యలక్ష్మి, జి. దుర్గాకుమారిగారలు.

చి॥ వసంత కుమారి, కె. జానకిగార్ల దైవప్రార్థనతో కార్యక్రమము ప్రారంభమాయను.

గృహలక్ష్మి సంయుక్త సంపాదకుడు శ్రీ సి. సి. పున్నయ్యగారు సభికులకు స్వాగతము చెప్పుచు శ్రీమతి రుక్మిణమ్మగారి కవిత్వమును ప్రశంసించి మనోజ్ఞమైన కవిత్వమును చెప్పుటకు పూర్వపుకవులు - నన్నయాదులు, శ్రీనాథుడు, అల్లసాని పెద్దన బోటి వారి కవితలను పఠించి వారి నైపుణ్యాన్ని అలవరచుకోవాలనియు, ఆధునిక కవిత్వ రచన సయితము భాషా సంపద, పాండిత్యమున్న నేకాని రాణించదనియు, శ్రీమతి రుక్మిణమ్మగారి కవితాసరళి సులభమైనదయినను ఉత్తమ లక్షణములతోటి, సాంప్రదాయాలతోటి ఒప్పునట్టిదనియు, ఇందుకు ఈమె యీ మధ్య రచించిన దేవీభాగవతము నిదర్శనమని, కంకణ ప్రదాత శ్రీ కేసరిగారి ఆరోగ్యము నిరుటికంటె యీనాడు చక్కబడటం మహాభాగ్యమనిరి.

శ్రీమతి వావిలికొలను పద్మాసనమ్మగారిని పరిచయముచేయుచు ఆమె నిరాడంబరమైనట్టియు, స్వార్థరహితమయినట్టి సంఘసేవను ప్రశంసించుచు మహిళా ఉద్యమ వ్యాప్తికి, పురోభివృద్ధికి చేసినసేవను వివరించి, అధ్యక్షత వహించి ఉత్సవ కార్యక్రమమును జయప్రదముగా సాగించవలసినదిగా కోరిరి.

అధ్యక్షురాలు, కంకణ గృహీత, ఆమె భర్త శ్రీ స్థానాపతి సత్యనారాయణ శాస్త్రిగారు, కంకణ ప్రదాత డాక్టరు కె. యన్. కేసరిగారు వేదిక నలంకరించిరి.

శ్రీ కేసరిగారు తాను అనారోగ్యముగానున్నను సభికుల ఆనందోత్సాహములు తనకీనాడు ఉత్సవములో పాల్గొనే శక్తిని సమకూర్చినవని తాను చేయదలచుకొనిన ఉపన్యాసమును తన కుమార్తె చి॥ వసంత కుమారి చదువగలదనిరి. వారి ఉపన్యాసము చదివిన అనంతరము శ్రీ కె. యన్. కేసరిగారు శ్రీమతి రుక్మిణమ్మగారికి కంకణ ప్రదానము చేసిరి.

శ్రీమతి రుక్మిణమ్మగారు ఉచితరీతిన ప్రత్యుత్తరమిచ్చిరి.

శ్రీ పెమ్మరాజు రామారావుగారు, శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, విద్యాసుందరి, త్యాగసేవాసక్త బెంగుళూరు నాగరత్నమ్మగార్లు పంపిన అభినందన సందేశములను చదివిరి

శ్రీ స్థానాపతి సత్యనారాయణ శాస్త్రిగారు ఉపన్యసించుచు తాను రుక్మిణమ్మగారి భర్తగానే పరిచయమయినానేమోనని ఛలోక్తిగానని యిట్లుపన్యసించిరి:

"కేసరిగారి అభిరుచులు, ఆసక్తి రాజర్షిగా ఒప్పించినవి. వీరు ముఖ్యంగా మహిళా లోకానికి చేయుచున్న సేవ అమోఘమైనది. వీరికీర్తి ప్రతిష్ఠలు చిరస్థాయిగా నుండుటకు వారి విగ్రహ స్థాపన ఆంధ్ర దేశంలో ఎంతైనా అవసరము. దీనిని ఆంధ్రప్రజానీకం గుర్తించుగాక!

అనేక స్త్రీల పత్రికలు వెలసినవి. కాని 'గృహలక్ష్మి' ప్రోత్సహిస్తున్నంతమంది అభ్యుదయ రచయిత్రులను మరొకటి ప్రోత్సహించడములేదు. మహిళా లోకంలో విజ్ఞాన వికాసాల వ్యాప్తికి యీ పత్రిక చూపుచున్న ఆసక్తి అపారము.

రాజకీయ చైతన్యము, పరిణామములు గమనించతగినవి. భారతీయ సాంప్రదాయాలైన అతిథి సత్కారంలాంటివి తమ ఆర్థికవ్యవస్థ కనుగుణ్యంగా పాటించడం మహిళల బాధ్యత. ఆదర్శప్రాయమైన కుటుంబజీవనము పరస్పర సహకార, సామరస్యాలమీద నాధారపడియుంటుంది.

శ్రీ కేసరిగారు ఆయురారోగ్య ఐశ్వర్యవంతులై ఏటేట యిట్టి ఉత్సవములు జరుపుదురు గాక!"

చి|| స్వర్ణాదేవి శ్రీమతి రుక్మిణమ్మగారి జీవితచరిత్రను చదివెను.

కవిచంద్రులు కోటసోదరకవులు తాము రచించిన పద్యములతోబాటు విద్వాన్ వేదము వేంకట కృష్ణశర్మ, కల్లూరు అహోబలరావు, ప్రొఫెసర్ కె. అంజిగార్ల పద్యములను చదివిరి. శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు రచించిన పద్యములను శ్రీమతి కె. చంద్రమతిగారు చదివిరి శ్రీ గిరిమెళ్ల వెంకట రామశాస్త్రిగారు తాను రచించిన అభినందన శ్లోకములను చదివిరి.

శ్రీమతి పద్మాసనమ్మగారు అధ్యక్షోపన్యాసములో కేసరిగారి ఉదారస్వభావమును కొనియాడుచూ శ్రీమతి రుక్మిణమ్మగారి భర్త సయితము కవి కావడంవలన ఆమె కవిత్వము చక్కగా రాణించినదనియు, తన పిల్లలతోటి గృహనిర్వహణ జరుపుకొనుచు కవితానైపుణ్యము నలవరచుకొనకలుగుట మెచ్చుకొనతగినదనిరి.

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ, శ్రీమతి లక్ష్మీరఘురాం, శ్రీమతి పూటుకూరు లక్ష్మీకాంతమ్మ, శ్రీమతి ఐ. రాజ్యలక్ష్మి, శ్రీ రామచంద్రుని వెంకటప్ప, శ్రీ కె. కె. మీనన్, శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావు, శ్రీ యన్. శ్రీ కంఠం, రమణాశ్రమములనుండి వచ్చిన సందేశములు చదువబడెను.

చి|| వసంతకుమారి, శ్రీ శాంతకుమారిగారల సంగీతకచ్చేరి సభ్యులను తన్మయులుగా చేసెను.

శ్రీ సి. సి. పున్నయ్యగారి వందన సమర్పణముతో కార్యక్రమము ముగిసెను.

---



స్వర్ణ కంకణ మహోత్సవ సభా చిత్రము.

# విజ్ఞప్తి

ఈసంవత్సరపు స్వర్ణకంకణ గృహీత శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు రచించిన దేవిభాగవతము పవిత్రగ్రంథము. ఇందలి శైలి, రచనానైపుణ్యము మనోజ్ఞంగాను, సరళంగానుండి పండిత పామరుల మన్ననల నందుకొన్నది. ఇది వ్యాసుడు రచించిన సంస్కృత దేవీభాగవతమునకు స్వేచ్ఛానువాదము. ఇంతకుముందనేకులు గద్య పద్య రూపములుగా అనువదించ పూనుకొనిరి కాని, సమగ్రమగు కృషిసల్పి రుక్మిణమ్మగారు కృతకృత్యులయినారు. ఇందలి కథలు చిన్న చిన్నవిగను, పురాణప్రాముఖ్యమును విపులీకరించునవిగా నుండి పామరులు సయితము సులభముగా గ్రహించుటకనువుగా నున్నవి. ప్రతి హిందూగృహమునందు, గ్రంథాలయమునందు వుండతగిన గ్రంథమనుటకు సందేహములేదు.

ఈగ్రంథముద్రణ సందర్భమున కవయిత్రి రుక్మిణమ్మగారు కొంత ఋణముపాలు కాకతప్పినదికాదు. ఈఋణము కనీసము 200 ప్రతులైనను వెంటనే అమ్ముడు పోయిననే కాని తీరదని తెలియుచున్నది. కాబట్టి మాగృహలక్ష్మి పాఠకులు, గ్రంథాలయ నిర్వాహకులు, భాషాభిమానులు యీగ్రంథప్రతులనుకొని పఠించి [illegible], పురుషార్థములను ఆర్జించి కవయిత్రిని ప్రోత్సహించ కోరుచున్నాను. ప్రతి వెల రు 12-8-0 లు. ప్రతులు మా కార్యాలయములో కూడ లభించును.

ఇట్లు
కె. యస్. కేసరి.

# లోకవార్తలు

ఎలిజబెత్ రాణి పట్టాభిషేకం 1953 సం॥ ము జరుగుతుందట.

♦ ♦ ♦

భారత ప్రభుత్వ ఆదేశము ననుసరించి మణుక్కు రు. 1 వంతున ధాన్య సేకరణ ధర హెచ్చింపుటకు రాష్ట్ర ప్రభుత్వము నిర్ణయించింది.

♦ ♦ ♦

అధ్యక్షుడు మినహా ఆంధ్ర కాంగ్రెస్ కార్యవర్గం ఫిబ్రవరి 27-వ తేదిన చిత్తూరులో రాజీనామా నిచ్చెను.

♦ ♦ ♦

పార్లమెంటుకు పోటీ చేసిన కేంద్ర మంత్రులందరు ఎన్నుకోబడిరి.

♦ ♦ ♦

క్షామపీడిత ప్రజల సహాయార్థం సేకరించే ధాన్య, వస్త్ర, విరాళములను ఉచితంగా రవాణా చేయవలసిందని మద్రాసు ప్రభుత్వం కలెక్టరకు ఆదేశించింది.

♦ ♦ ♦

ప్రివెంటివుడిటెన్షన్ చట్టం మరో 6 నెలలు పొడిగించడానికి ప్రభుత్వము ప్రవేశపెట్టిన బిల్లు పార్లమెంటులో తొలి ఆమోదాన్ని పొందింది.

♦ ♦ ♦

గత 50 సంవత్సరములుగా ఆంధ్ర దేశంలో సంఘసేవా కార్యక్రమమును సాగించిన శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు ఫిబ్రవరి 27-వ తేదిన కాలధర్మము నొందిరి.



శ్రీమతి చీమలపాటి సూర్యమహాలక్ష్మిగారు మార్చి నెలలో జరుగనున్న శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారి (విశాఖపట్నం) సన్మాన సంఘ కార్యదర్శిని.

నేడే

చూడండి

విజయ వారి

# పెళ్లి చేసి చూడు

నటులు : జి. వరలక్ష్మి, యన్. టి. రామారావు, సావిత్రి, జోగారావు, దొరస్వామి, డా. శివరామ కృష్ణయ్య, రంగారావు, పుష్పలత, వెంకయ్య, కుందు, బేబీగిరిజ, బాలకృష్ణ, పద్మనాభం వగైరా.





డైరెక్టర్....ప్రసాద్ . . . . నిర్మాతలు...నాగిరెడ్డి & చక్రపాణి

# తుమ్మెద — పువ్వు

శ్రీ బాలకృష్ణగారు

(గత సంచిక తరువాయి)

## తాగుబోతు

అతను ఆమెనే చేసుకోవాలని అనుకుంటూండే వాడు... ఇద్దరూ అనుకుంటూండేవారు. ఒకరికి ఒకరి అభిప్రాయం తెలిస్తేనేగా అది కుదరటం. కుదిరింది. ఇద్దరూ కలుసుకునేవారు నిర్జన ప్రదేశాల్లో... రోజూ 6½కు కుంకేసూర్యుడు 5½కే అస్తమించడం ప్రారంభించాడు... రోజులన్నీ ఒకలాగే నడవవుగా. అతను యింకొకతెను చేసుకోవలసి వచ్చింది పరిస్థితుల ఒత్తిడివల్ల ... ఆమె యింకొకని వివాహమాడింది... అది స్త్రీకి తప్పని విషయంకనుక... రోజులు... సంవత్సరాలు గిరగిరా తిరిగాయి... వాటి ధర్మం నిర్వర్తిస్తూ... ఆమెభర్త ఓపమనేనేళ్ల పిల్లవానిని వదలిపోయాడు 33 ఏళ్లే 100 ఏళ్లూనిండి... అతనికూతురు చిన్నమాటలు తప్పటడుగులు దాటి... యౌవనజీవిత ప్రాంగణంలో అడుగుపెట్టింది... ఆమె విధవగా ... పూర్వస్నేహాన్ని పురస్కరించుకొని అతని ఊరికి వచ్చింది... అతని భార్యపోయి అప్పటికి ఆరుమాసాలయింది... ఇరువురిలో మునుపటి తలపులు మొలకలెత్తినై ...తల్లి, తండ్రుల బాధ్యతలు మీదుండటంవల్ల మొలకల్ని తుంపేశారు ... ఆమెకొడుకు అతని కూతురు కాలేజి చదువుకు వెళ్లారు వారిద్ద ఒకఊరినుంచే వెళ్లడంవల్ల కొంచెం పరిచయం వయసులో వుండే స్త్రీ పురుషులకు పరిచయం ప్రేమకు, ప్రేమపెళ్లికి దారితీస్తాయి స్వతహాగా... ఆమె జబ్బుచేసి ప్రాణాలు వదలింది... ఆమెకొడుకును కాలేజికి ప్రోత్సహించి పంపింది అతనే... కొన్నాళ్లకు అతనిని అడిగారు యిద్దరూ పెళ్లి చేసుకుంటామని... ఇద్దరకూ గార్డియన్ అతనేగా.. ఏంచేస్తాడు! వద్దంటే ... యిద్దరూ బాధతో కుములిపోతారు... ప్రేమిస్తున్నామని పెళ్లికోసం అడిగినవాళ్లు ఏంచేసి వుంటారు...తన స్వంత అనుభవంతో కొలచి చూసాడు. జరిగేది ఎల్లాగాజరిగింది.. ఏంచెయ్యాలి వారిద్దరూ అన్నాచెల్లెళ్లని ఏవిధంగా తెలియజెయ్యాలి ... తెలియజేస్తే ఫలితం! వారిరువురూ పశ్చాత్తాపదుఃఖంతో కుమిలిపోడం, కుమిలి నశించి పోడం...తనకు సుఖం లేకపోడం...ఏదో నిశ్చయించాడు...నిశ్చయాన్ని తెలియబర్చాడు రిజష్టరు మేరేజి చేసుకోమని. అతనిలో ఏదోఅగ్నిజ్వాలలు అలముకోనడం ప్రారంభించినై ... ఏదో పాపభీతి వెంటాడుతోంది... తాను చేసినది తననే దహించడం ప్రారంభించింది. ఆరహస్యం లోకానికి సంఘానికి తెలియని రహస్యం ... దాగేందుకు అతనిహృదిలో చోటులేదు. సంఘదృష్టిలో వారిద్దరూ భార్యాభర్తలే...వారికి సంఘంలో గౌరవం వుంటుంది... అతన్ని ఏదోఅజ్ఞాతశక్తి "చెప్పు ఆవిషయాన్ని చెప్పు" అని తరిమింది. ఏదో "ఫలితాన్ని ఆలోచించు" అంటోంది... విసురుగా వెళ్లేడు వాళ్లిద్దరూ వున్నచోటికి ... లోనికి చూచాడు...వారిరువురూ ఏదో అమర ఆనందంలో వూగుతున్నారు. మురిసిపోతున్నారు తమకలలు నిజమైనాయని ... అతను వారిద్దరూ తన బిడ్డలనిచెప్పే... ఆమాట పెద్దభూతమై వారిద్దరి పీకల్ని బట్టి పిసుకుతోంది ... లోకదృష్టిలో ఆమె పతివ్రతఅని వ్రాసియున్న గిల్టు అక్షరాలను చెరిపి ఆభూతం కులటగా వ్రాస్తోంది...ఆభూతం వెనక్కు తిరిగింది. చేతులు చాపింది ఏదో కండలేని, రూపంలేని హస్తం అతని పీకను పట్టడంకోసం దూసుకు వచ్చింది ... అతనికాళ్లు పరుగు తీశాయి వేగంగా ... ఎక్కడకో-సారాదుకాణంవద్దకడుపు నిండా త్రాగాడు. సారా ఏదో తెలియని మత్తు ఆవరించింది...అతన్ని ...లోకదృష్టిలో అతనుయిప్పుడు త్రాగుబోతు మాత్రమే! ...

## ప్రణయము

ఆమె అతనిగొంతులో అమరత్వాన్ని అతనిమాటల తియ్యదనంలో అమృతాన్ని చూస్తూ అల్లాగేవుండిపోతుంది గంటలూ, రోజులూ. ఆమె అపరూప సౌందర్యంలో ఏదో ఊహాతీతమూ అమరానందాన్నను భవిస్తూ స్వర్గధామంలో తేలిపోతూంటాడు ఆమె సాన్నిధ్యంలో. వారిమధ్య యుగాలు, క్షణాలుగా దొర్లిపోతూంటాయి. వారిమధ్య ప్రేమ దాని సాధారణ భావంలోకాక ఏదో లోలోతునుండి

వచ్చే అపూర్వ అర్థంతో విరాజిల్లుతూంటుంది. యుగయుగాలనుండీ స్త్రీ పురుషుల దోహదంతో ఏపుగా ఎదిగే ప్రేమలత వీరివద్దకు వచ్చి ఏదో భావాతీతమైన అర్థంతో యిరువురినీ కట్టివేసింది. వారిరువురి మధ్యా మోహానికి చోటులేదు. ఇరువురూ ఒకరి నొకరు విడిచి వుండలేరు. ఈ విషయం యిరువురికీ తెలుసు. విడిపోవలసివచ్చే క్షణంగురించి యిద్దరూ ఆలోచించేందుకు భయంతో వణుకుతారు. ఆరోజునఎందుకో ఆక్షణాన్ని దూరంచేద్దామని వుద్దేశ్యం మొలకెత్తింది అతనిలో ... తనచేతిలో అదివున్నట్టుగానే. అలా యిరువురూ వుండడం సంఘం హర్షించదు. నీతిసూత్రాలు వారిప్రక్కనే గూడుఅల్లి వారిని వెలిపెట్టాయి. అతను అనుకున్నాడు ఆమెను భార్య చేసుకోడంతో సమస్యా పరిష్కారం అవుతుందని. సంఘానికి ఎదురొమ్ము విరచి నిలబడి (సంఘదృష్టిలో) కులటాపుత్రికను చేసుకోడంతో సమస్యా పరిష్కారం అవుతుం దనుకున్నాడు. సంఘంలో కుళ్లు వున్నపుడు నాకెందుకని ఓమూల తనంతాను పెళ్లి చేసుకోనివుంటే ఆకుళ్లువాసన తనకి రాదనుకున్నాడు .... అడిగాడు ఆమెను అవిషయం.. అమె చెప్పింది సంఘానికి భయపడి పెళ్లి చేసుకోవడం అనవసరమని, సంఘం తనప్రభావాన్ని యీవిధంగానే ప్రసరింపజేస్తుందని. సంఘం అంటే ఏదోభూతం ఎదురుగావచ్చి ఆపని చెయ్యమని శాసించిందనీ. ఏదో అజ్ఞాతహస్తం (సంఘం) అతన్ని పెళ్లివిషయం ఆలోచింపచేసిందే ప్రతిపనినీ చేయిస్తుందనీ. పెళ్లి చేసుకోని మూలకూచుని సంఘాన్ని ధిక్కరించి గెలిచాననీ ధీమాతోవుండడం నిజంగా గెలవడంకాదనీ, గౌరవంగా (సంఘదృష్టిలో) యిష్టం కాకపోయినా తల్లిదండ్రులు చెప్పిన ఆమెనే చేసుకోని పడివుండడంకన్న నికృష్టమనీ, సంఘసంస్కరణ, పెళ్లిచేసుకోనిసంఘాన్నివదలి దూరంగాపోయి చుట్టూ గూడుకట్టుకుని కూచుంటే గాదని, సంఘంలోనే వుండి (అందులో ఎదురుగా నిలబడి) ఆబలీయమైన శక్తిముందు నిలబడి సంఘధర్మాలను వుత్తమస్థాయికి తీసుకువెళ్లాలని, సంఘంచెడ్డదికాదు - యిప్పుడున్న సంఘదృక్పథం చెడ్డదనీ, బూజుపట్టిన దాని దృక్పథాలను మార్చి నూతన మెరుగులతో వెలుగుదారులలో నడిపించాలనీ దేశకాలాలనుబట్టి సంఘదృక్పథం మారాలనీ... ఏదో... ఏదో యింకా యింకా... అతను చూచాడు ఆమెవైపు బ్రహ్మరహస్యం తెలిసిన వేదాంతిలా... ఇద్దరు విడువలేని ప్రాణస్నేహితుల్లా జీవితం నడుపవచ్చు అంది ఆమె ఏదో తీరని సందేహానికి సమాధానం దొరికింది. ఆమె చెప్పిందానికి తలవూపాడు......

అవును గడపవచ్చు ప్రాణస్నేహితుల్లా వేరువేరుగా వారిజీవితాల్లో మరొకరు ప్రవేశించకుండా వున్నంతకాలం-తరువాత క్షణాలు యుగాలుగా ...

## అపశృతి

అతను, ఆమె మొన్న సినిమాకు వెళ్దామంటే బయల్దేరలేదుకనక ఆమె అతను యీవాళ వెళ్దామంటే రాడు. పురుషుడు కొంచెంఎదిగిన మొక్క అనుకుంటే అతని జీవితానికి సుదూర సీమలలో వివిధ పరిస్థితులలో ఎదిగిన ఒకస్త్రీ జీవితాన్ని తీసుకువచ్చి ముడిపెట్టారు - తప్పదుకనుక. ఇద్దరి మానసిక భావాలు, ఆశయాలు కలిశాయా జీవితాన్ని సులభంగా యీదుకుంటూ పోతారు. సాధారణంగా కలియవనేచెప్పాలి. కలియకపోయినా ... వందకు తొంభై సంసారాల్లో Co-operation వుంటుంది. ఇద్దరూ ఒరగేసుకుపోయే వాళ్లు కాకపోయి యిరువురూ తెగేదాకా ఏవిషయానైనా తెంపాలనిచూస్తే ... యికవారు చూచేవి న్యాయస్థానాలు ... సంసారంవీధినపడుతుంది. జీవితాన్నంతా ఒకరిపై ఒకరు ఆధారపడవలసినవాళ్లలో అహంభావాలు కనీసం వారిద్దరి మధ్యనైనా చావకపోతే ఫలితం... అపశృతి. ఆమె ఆలోచించేది- మొన్నెందుకు అతను రానన్నాలి అనేకాని ఎందుకు వద్దన్నాడు అనికాదు. ఆమెలోని ఆహంభావం inferiority complex ఆమె నంతచేశాయి... అతను ఎంత ఒరగేసుకు పోయేవాడయినా ఎంతకాదన్నా సంపాదించేవాణ్ణి పోషించేవాణ్ణి అనే ఆహంభావం అతన్ని పీక్కుతింటోంది. అతను ఆఫీసులోకలిగిన చిరాకుని అంతరాత్మ లేవదీసిన ఏదో విప్లవాన్ని సినిమా

చూసే మోహంలో మర్చిపోదామనుకున్నాడు. కాని యింటికి వచ్చేటప్పటికి చుక్కెదురు. ఆమె అంది నాకు సర్దాగా వున్నపుడు మీరు రానపుడు నేను యీవాళ ఎందుకు 'రావాలిఅని... ఆమె అడిగిన దానిలో Logic వుంది. సరియైన సమాధానం చెప్పలేనప్పుడు పుట్టేది వుడుకుబోతుతనం.. దానినుంచి వుద్భవించేది కోపం... అతనికి కోపం .. మనుజుల్ని రాక్షసులలోకి రవాణాచేసేందుక్కు అదొకదారి) వచ్చింది. ఏదోచిరాకు కోపంగా మారుతోంది "సరే ... వడ్డించు" అన్నాడు .. వడ్డన అయింది. అతని దృష్టికి ఆమెనడతలో, ప్రతిఅడుగులోనూ అహంభావం, తలవిరుపు, విరగబాటుతనం, ఏదో పగతీర్చుకున్నట్లు (విజయసూచకమా) గర్వం... కనపడుతున్నై ... "ఏం బాగులేదు కూర.. ఉప్పు ఎక్కువ" అతను విసుక్కున్నాడు. అతను తన్ను కంట్రోలు చేసుకుందుక్కు పడేఅవస్థని అసమర్థత కింద తీసుకుంది... అసమర్థతకింద కాకపోయినా అలుసుతనంకింద తీసుకుంది ... "ఇదేమన్నా కబుర్లా తూచి చెప్పటానిక్కు... ఓ!యి అటుపడుతుంది యిటూ పడుతుంది"... అతని నోట్లోనంచి మాట రాలేదు... నోట్లోకి ముద్దా వెళ్లలేదు. విస్తరివదలి చివాలున లేచిపోయాడు. అతనిలో కోపం అంచుల వద్దనుంది... పంచె కట్టుకుని గుమ్మం దాటుతున్నాడు. ఆమె పొదికట్టున నుంచుని..."అయితే మీరు వెళ్తున్నారన్నమాట... నేను యిటు యింకో థియేటరుకెళ్లవచ్చుగా... అతనిలోనిఓర్పును మించిపోయింది కోపం... కోపము సహనపు సరిహద్దుల్ని దాటింది 'ఉ'హుంకారం అది కనుబొమలముడితో ఎర్రబడిన మొగంతో చూచాడు. ఎదురుగా ఏదో గర్వంతో చూచేచూపు. అతనిలోని రాక్షసత్వం నాగరికత వెనకదాగున్నది... దూసుకు వచ్చింది .. చెయ్యి... పైకిలేచింది... రాక్షస సహజమైన పని చేయడానిక్కు ... అతడు యుక్తాయుక్త జ్ఞానం తెలియని ఒకపశువుగా ప్రవర్తించ బోతున్నాడు... ఎదురుగా... బిక్కమొగం బెదురుకళ్లు... అతనిలోని నాగరికత నువ్వేయిల్లా చేస్తే... అంది... ఏం అధికారం వుంది? అంది.. ఏదో.. అంతరాత్మ ఛెళ్లున కొట్టింది శేకచాపలా... భరించలేని బాధతో శయ్యాసాశ్రయించాడు... తనుచేసిన పనికి మళ్లీ ఆమెముఖం చూడలేక సిగ్గుతో ముంచుకుపోయాడు...

చెక్కిలిమీద చెయ్యివేస్తూ. "ఏమండీ! కోపమా? తమాషాకి అన్నాను... లేవండీ సినిమాకివెళ్దాం!..."

## కథ

అసలు ఆయన కథలు వ్రాయటంవల్ల ప్రజలకేమన్నా ఉపకారం వుందా అని తల్లక్రిందులుగా ఆలోచిస్తూండేవాడు బుర్ర చెడగొట్టుకుంటూ. ఆయన అనుకుంటూండేవాడు pen లో ink చెల్లక తను వ్రాస్తున్నట్టూ, జేబులోడబ్బులు బొత్తిగా చెల్లకవాళ్లు కొనుక్కొని చదువుతున్నట్టూ. ఆయన యీనాడు కనిపెట్టినవిషయం ఏమిటంటే తనురాసిన కథలు కొంచెం ప్రజల కుపయోగ పడ్డాయి అర్థం చేసుకుంటే అని ..

ఆయన కూతురికి అసలు విషయమేం అర్థం కాలేదు .. మొన్నటివరకూ చిన్న పరికిణీకట్టుకొని చెంగుచెంగున గెంతుతూ ఆటలాడుకునే తన్ను యిల్లా ఎందుక్కు బంధించేస్తున్నారూ అనేది. మొన్నటి వరకూ పక్కింటి అబ్బాయితో ఆడుకొనేది దొంగాట. అదీ... ఇప్పుడు హఠాత్తుగా వచ్చిన ప్రమాదమేదో తెలీలేదు... ఆమె ఘోర్తుఘోరంచదువుతోంది, రెండునెల్లు ఘోర్తుఘోరం చదవటం అయింది... మిన్నువిరిగి మీదపడట్టు... "ఇంకనువ్వు స్కూలుకెళ్లకూడదమ్మా" అనేసి ఊరుకున్నారు. పైపైతే వేసుకోడం బాగానే వుంది కాని ఈ అడుగడుగుకు ఆంక్షలుమాత్రం ఏం బాగులేవు... తన చిన్నబుర్రతో ఆలోచించి చూసింది, అసలు విషయమేమై వుంటుందాఅని... ఎంత ఆలోచించినా అర్థంకాక ఓరోజున తల్లినడిగి చూస్తుంది... ఆమె, ఎల్లా చెప్పాలో ఏంచెప్పాలో అర్థంకాక బుర్ర గోక్కొని అటుమాసి యిటుచూసి... "నువ్వు వయస్సు వచ్చిన పిల్లవు వెళ్లకూడదు" అంది... 'ఏం' అని అడిగేప్పటిక్కు అల్లా అడక్కూడదని నోరునొక్కి కసురుకుంది. ఆమెకది తీరనిసందేహంగానే వుండిపోయింది.

అపహా తడపా ఆవిషయాన్ని అడుగుతూనే వుంది తల్లిని అర్థంకాక... ఆయనకా విషయం తెల్సింది... ఆయన కథలోని కథానాయిక చాల తెలివైంది నవనాగరీక యువతి... యువతివున్న తర్వాత కథలో యిక ఎవరో ఒకరు ప్రేమించాలి ఆమెను. మన కథ అల్లాలేదు... ఒక నవనాగరీకుడు ఆమెను వెంటాడుతూంటాడు. ఏదో ఒక దుర్బలక్షణంలో పడగొట్టి ఆమెను అనుభవించేందుకు... ఇద్దరూ కాలేజీస్టూడెంట్లు లెండి ... యిక సినిమాలా ... డ్రామాలా ... ఏకాంత విహారాలా ... what not అన్నీ వీ... ఒకటి తప్పిపోగూడదు... ఆమె అతన్ని ప్రేమించలేదు... అతను ఆమెను ప్రేమించలేదు... ఇద్దరూ friendsమాత్రమే ! ... ఇంకకథ ఎల్లాఅంత మాతే మనకెందుకు లెండి... అక్కడే ఆయన మణి పూసల్లాంటి వాక్యాలు దొల్లించాడు. "అందరకు వయసురాగానే యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం రాదు. వారుచేసిన పని తెల్సిచేసినారు; తెలియక చేసినా ఫలితం అనుభవించక తప్పదు. చంటిపిల్లవాడు నిప్పులో చెయ్యి తెలిసిపెట్టినా తెలియక పెట్టినా కాలి తీరుతుంది. ఆయాపరిస్థితులు వచ్చినపుడు ఎంతటి ఋషులైనా స్త్రీవాంఛకు లోనౌతారు. ఎంతటి స్త్రీయైనా పురుషునికి ఏదుర్బలక్షణంలోనో లొంగి తీరుతుంది. ఆక్షణం దాటినతర్వాత లాభంలేదు. (దీనికి అతీతులైన పురుషులూ వుండవచ్చు స్త్రీలూ వుండవచ్చు... అంతా అటువంటివాళ్లు కారుగా) ఒకసారి జారిన స్త్రీకి మరల సంఘంలో స్థానంలేదు. అందుకే, తల్లిదండ్రులు వయస్సువచ్చిన పిల్లల్ని (మొగపురుషుడవనీ స్త్రీఅవనీ) జాగర్తగా చూసుకోవాలంటారు ... అదంతా ఆదుర్బలక్షణాన్ని దూరంచేసే యత్నమే ! యింకా... యింకా అతను పత్రికకు పంపుదామని కవరులో పెట్టిన కాగితాలు చిందరవందరగా ఉన్నాయి. ఆమె తల్లిని ఆవిషయం గురించి అడగడం మానివేసింది... అతను కనిపెట్టాడు తనకథవల్ల ప్రజల కుపయోగముందని...





కంకణ గృహీత రుక్మిణమ్మ,
భర్త సత్యనారాయణశాస్త్రి,
అధ్యక్షురాలు పద్మాసనమ్మ
గార్లు.



# సంపాదకీయములు

## శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారి నిర్యాణము

గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీతలలో శ్రీమతి లక్ష్మీబాయమ్మగారొకరు.

ఈమె యావజ్జీవమును సంఘసేవకు, స్త్రీవిద్యావ్యాప్తికి అంకితముచేసిన త్యాగమూర్తి.

మన ఆంధ్రదేశములో వితంతువివాహ ఉద్యమమును ప్రచారముచేసి 1903 సం॥ను స్వయముగా శరణాలయమును స్థాపించి అచంచలమైన దీక్షతో నిర్వహించి 60 మంది వితంతువులకు భర్తృదాన మొసంగిన సంస్కర్త. దేశస్వాతంత్ర్య సమరంలో తన భర్త శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారితోబాటు నిర్వహించిన పాత్ర అద్వితీయమైనది. ఆమె ధైర్యోత్సాహము అనేకమంది నారీమణులను ఉత్తేజపరచి స్వాతంత్ర్య సమరరంగంలోనికి దూకించినవి. ఆమె సహకారం శ్రీ లక్ష్మీనారాయణగారికి, ఆయనకార్యక్రమమునకు తోడునీడైనది. స్త్రీవిద్యావ్యాప్తికి ఆమెచేసినకృషి, ప్రచారము అపారములు. ఆమె స్వయముగా శారదానికేతనమును స్థాపించి అనేకమంది పేదసాదలకు విద్యాప్రదాన మొనరించినది. ఆసంస్థనిర్వాహకురాలుగాను ఆమెచేసిన కృషి అమోఘమయినది.

ఆమె సంఘసంస్కర్త, వీరవనిత; ఆదర్శనారీమణి. ఆంధ్రదేశము ఆమెను కోల్పోయింది. కాని ఆమె ప్రారంభించిన ఉద్యమాలు మాత్రం సర్వతోముఖాభివృద్ధినొందుతున్నవి. ముఖ్యంగా 'శారదానికేతనము' ఆమె స్మారకచిహ్నంగా నొప్పుతున్నది. కాని ఆర్థికంగా లోటుబాట్లున్నట్లు తెలుస్తున్నది. ఆంధ్రప్రజానీకం శారదానికేతన పటిష్టమైన నిర్వహణకు సహకరించి సంస్థ యభివృద్ధికి తోడ్పడటం ఎంతైనా అవసరం అప్పుడే ఆమెను, ఆమె త్యాగసేవాతత్పరతను గుర్తించిన వారగుదురు.

ఈసందర్భంలో యావదాంధ్ర దేశంతోబాటు మేముకూడ మాసంతాప సానుభూతులను శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారికి, ఏకైక సంతానమైన శ్రీజనార్దన్ రావుగారికి, శారదానికేతన నిర్వాహకులకు తెలుపుచున్నాము.

## మద్రాసు క్రొత్తగవర్నరు

ఇంతకాలము మన రాష్ట్రగవర్నరుగా నున్న శ్రీ భావనగరు మహారాజాగారు స్వంతకారణముల వలన పదవినుండి విరమించుకొన్నారు. ఆయన స్థానే కేంద్ర మంత్రిగా నుంటుండిన శ్రీప్రకాశ మన రాష్ట్ర గవర్నరుగా పదవి స్వీకారం చేశారు. వీరికి మా 'సుస్వాగతం.'

మనరాష్ట్రంలో యీసమయంలోనున్న కలవర పరిస్థితులను అవగాహనము చేసికొని సుస్థిరమయిన, ప్రజానురంజకమయిన ప్రజాప్రభుత్వమును స్థాపించవలసిన ఆవశ్యకత ఎంతైనా కలదు. ఇందుకు శ్రీప్రకాశ సమర్థుడనడంలో సందేహములేదు. ఈయన రాజకీయ, సాంఘికరంగములలో నిరంతర దేశసేవాదీక్షతో నిమగ్నుడైన వ్యక్తి. ఈయన రాజకీయ చతురత మనరాష్ట్రములోని రాజకీయ శక్తులలో ఏర్పడియున్న అనైక్యతను నిర్మూలించి అభ్యుదయ సామరస్యములను సమకూర్చగలదని ఆశిస్తున్నాము.

పరిపాలనా దక్షతయందు శ్రీప్రకాశ అనుభవము అపారము. మన రాష్ట్రంలో ప్రస్తుతము ఏర్పడిన కరువు కాటకాలు, ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణము మొదలగు ప్రధాన సమస్యలను వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా పరిష్కరించడానికి శక్తివంచనలేకుండా కృషిచేసి ప్రజల ఆదరాభిమానములకు పాత్రుడు కావడం వాంఛనీయం.

ప్రస్తుత పరిస్థితులలో మన రాష్ట్రాన్ని ఎదుర్కొంటున్న వివిధక్లిష్ట సమస్యలమధ్య ధైర్యంగా యీపదవి నలంకరించిన శ్రీ ప్రకాశను హృదయ పూర్వకముగా నభినందిస్తున్నాము. గవర్నరు పదవి నుండి విరమించిన శ్రీ భావనగరు మహారాజాగారికి సంతోషపూర్వకంగా వీడ్కోలు సమర్పిస్తున్నాము.

## గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవము.

ఎప్పటియట్లు గృహలక్ష్మి జయంతి యీనెల 2వ తేదిన వైభవముగా జరిగింది. శ్రీమతి స్థాపాపతి రుక్మిణమ్మగారికి స్వర్ణకంకణ ప్రదాన సందర్భమున ఆమె సందేశము పేర్కొనతగినది. అందులో మహిళాభ్యుదయము ఎల్లప్పుడు సంఘములో సామరస్యము నుద్దేశించినదిగా నుండవలెనని ప్రబోధించినది.

ఇక స్త్రీలకు సమాజములోగల ఉత్తమస్థానమును గురించి ఉపన్యసించుచు 'మాతృ స్వరూపమున బిడ్డలకు విజ్ఞానసిద్ధి కలుగచేయునది స్త్రీ. ప్రణయినీరూపమున ప్రియునకు హితబోధచేయునది స్త్రీ. కావున విజ్ఞానసిద్ధి స్త్రీరూపమున కలుగుచున్నదన్న విషయం నిర్వివాదాంశమైనదని' ఉల్లేఖించారు.

సంఘంలో తమ స్థానమును ఉత్తమ శ్రేణికి తెచ్చుకొనడం స్త్రీలచేతులలోనే యున్నదనియు, వారి ఆదర్శనీయమైన జీవితము తమ ఆర్థికపరిస్థితుల దృష్ట్యా రూపొందించుకోటం ఎంతైనా అవసరమని వారి అభిప్రాయం. వారి సందేశము, జీవితము మహిళాలోకమునకు మార్గదర్శకమగుగాక'

## శ్రీ ఖరనామ సంll ఫాల్గుణమాసము - శ్రీ నందననామ సంll చైత్రమాసం.

| | | | |
|---|---|---|---|
| 1952 సంll మార్చి నెల | 16 | ఆ | పం 40-54 విశా 42.38 హ 44-3 శేషం, 1-10, త్యా 3-53 |
| | 17 | సో | ష 37.31 అనూ 40.49 వజ 38.20 వతె 3-59 మొ 5-31 కు |
| | 18 | మం | స 32-57 జ్యే 37-58 సిద్ధి 31-12 త్యా 3.46 వతె 4-52 మొ |
| | 19 | బు | అ 27.38 మూ 34-34 వ్య 24-37 వరా 6.26 మొ 7-56 కు అష్టమీతిథిః |
| | 20 | గు | న 23.43 పూషా. 30-14 శేవ ఈ 6-20 తిథిద్వయం |
| | 21 | శు | ద 15-21 ఉషా, 25-45 వ 8-51 త్యా 3.42 ఏకాదశితిథిః |
| | 22 | శ | ఏ 8-53 శ్ర 21-11 సిద్ధ 52-4 సర్వోపవాసః |
| | 23 | ఆ | ద్వా 2-36 ఏష్యా 54.3 వరా 7-35 మొ 9-5 కు |
| | 24 | సో | చతు 51-53 శత 13-4 ది 28-17 వసా 5-23 మొ 6 54 కు |
| | 25 | మం | ● అమా 47-42 పూభా 10-8 వరా 7-20 మొ 8-52 కు అమాసోమవారవ్రతం |
| | | | **శ్రీ నందననామ సంవత్సర చైత్రమాసము** |
| | 26 | బు | శుద్ధపాడ్యమి. 44-36 ఉభా 7-54 వరా 8-59 మొ 10-33 కు |
| | 27 | గు | వి 42-2 రే 6-43 త్యా 4-1 చంద్రోదయం |
| | 28 | శు | త 41-21 అశ్వ 6-56. రా 1.15 సౌభాగ్య గౌరివ్రతం |
| | 29 | శ | చ 41-55 భ 8-24 రా 9-26. అమృతయోగః |
| | 30 | ఆ | ప 43.38 కృ 11-3. రా 23-14 |
| | 31 | సో | ష 46-24 రో 14-46, ది 29-53 |
| 1952 సంll ఏప్రిల్ నెల | 1 | మం | స 50-1 మృ 19-24 త్యా 4-22, అబ్దసంధిత్యాగం |
| | 2 | బు | అ 54-17 ఆర్ద్ర 24-46, రా 27-16. అశోకాష్టమీ |
| | 3 | గు | న 58-14 పున 30-36 శ్రీరామజయంతి, గురుమౌఢ్యారంభం |
| | 4 | శు | ద 60-10 పుష్య 36-38. త్యాజ్యాభావః, ధర్మరాజదశమి |
| | 5 | శ | ద 3-36 ఆశ్రే 42.36 ది 11-44 |
| | 6 | ఆ | ఏ 8-5 మ 48-15 ది 15-20 |
| | 7 | సో | ద్వా 12-4 పూఫ 53-18 ది 9-49 |
| | 8 | మం | త్ర 15-20 ఉఫ 57-31 దివి 12.27. అనంగత్రయోదశి |
| | 9 | బు | చతు 17-38 హ 60-10 ది 19-30 |
| | 10 | గు | ○ పౌ 18-51 హ 0-29 దివి 21-12 తిథిః |
| | 11 | శు | బ. పాడ్యమి చి 18-51 దివి 16-41 |
| | 12 | శ | వి 17-37 స్వా 3-15 ది 17-11 పార్థసారథిస్వామి గరుడోత్సవం |
| | 13 | ఆ | త 15-9 విశా 2-48 ది 12-33 |
| | 14 | సో | చ 11-32 అనూ 1-12 జ్యే 57-33. ది 14-32 |
| | 15 | మం | ప 6-54 మూ 55-10, ది 17-26, మత్స్యజయంతి. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

